# రెండు మాటలు

శ్రీ మద్విక్రమసింహపురము (నెల్లూరు) చోళవంశతిలకుఁడగు మనుమసిద్ధి పరిపాలిత మనుట చరిత్ర ప్రసిద్ధము. అది పండ్రెండు పదమూఁడు శతాబ్దముల మధ్య కాలము కొట్టరువు వంశదీపకులగు సిద్దయ కొమ్మయామాత్యు లన్నదమ్ములు. రెండవవాఁడగు కొమ్మయామాత్యుని కుమారరత్నమే మన కవితిక్కన. ఇతఁడు మనుమసిద్ధికి మంత్రియు, నాస్థానకవియు నగుట జగత్ప్రసిద్ధము. తొలుదొల్త నుత్తరరామచరిత్రమును వ్రాసి తిక్కన మనుమసిద్ధి కంకితమొనరించెను. కవితాకన్యను జేపట్టినవాఁడగుట మనుమసిద్ధి, తిక్కన్నను "మామా" అని పిలుచుచుండెడివాఁడట. ఆ చనువే క్రమముగ వృద్ధియై తిక్కన్నను సోమయాజిగ నొనరించి భారతాంధ్రీకరణమునకుఁ బురికొల్పినదఁట! ఈ తిక్కన సోమయాజికిఁ బెదతండ్రి కుమారుఁడే మన కథానాయకుఁడు రణతిక్కన్న. మనుమసిద్ధికి సేనానియై రణవిహార మొనరించుటచే నితఁడు "రణతిక్కన్న" యయ్యెను. ఖడ్గసంచాలకుఁడగుట 'ఖడ్గతిక్కన్న' యనియు వ్యవహరింపఁబడుచుండెను. ప్రకృత మనుసరింతము. ఈ రణతిక్కన చరిత్రమును వ్రాయు సదృష్టమును మత్కులదైవంబగు శ్రీ రాధాకృష్ణప్రభువే నాకుఁ గలిగించినాఁడనుట నతిశయోక్తి గానేరదు.

మనుమసిద్ధికిని; కనిగిరిసీమకుఁ జెందిన యెరగడ్డపాటిప్రభువగు కాటమఱేనికిని పశువుల పుల్లరి కారణముగా కలిగిన మహాసంగ్రామమే యిందలి యితివృత్తము. ఈ యితివృత్తమును గూర్చియు; నిందలి పాత్రలను గూర్చియు నించుక ప్రస్తావవిషయమున నిందు ముచ్చటించుకొందము.

“ఇదం బ్రాహ్మ్య మిదం క్షాత్ర”మ్మని రెండుతేజమ్ము లొక్కమ్మడిఁ జక్కదిద్దుకొన్న భార్గవరాముని దలపించు ఖడ్గ తిక్కన్నయే యిందలి కథానాయకుఁడు. జగమెఱింగిన బ్రాహ్మణుఁడు. యుద్ధసందర్భమునఁ గాటమఱేని పక్ష మాశ్రయించిన పిన్నమనాయఁడీ విషయమును బలపఱచుచు నేమనుచున్నాఁడో చూడుడు.

“పోరు నిలుపు మోయి బ్రాహ్మణోత్తముఁడ!
సరిగాదు మాతోడ సమరంబు సేయ
అగ్రజుల్ మీరు యాదవులము మేము
ఉగ్రముల్ మామీద నుంపంగరాదు”
— కాటమరాజు కథ

నాయిక చానమ్మ. చానమ్మ తిక్కన్నకు సరియైన వీరపత్ని. ఈ యమనుగూర్చిన కవిసూక్తులే యిందు పర్యాప్తములు.

“విఱిగివచ్చిన ప్రాణవిభునకుఁ బసుపిచ్చి
వేడినీళ్లను దోడెఁ గోడలొక్కతె”
— రాయప్రోలు సుబ్బారాయకవి

తనకావిధముగఁ బసుపును, వేడినీళ్లు నిచ్చి మంచ మడ్డు పెట్టి స్నానము చేయుమని యీసడింపుగా పలుకగా; విఱిగి వచ్చిన తిక్కన యిది యేమని యడిగినతోడనే చానమ్మ యేమనుచున్నదో విందము.

కం. “పగరకు వెన్నిచ్చినచో
నగరే నిను మగతనంపు నాయకు లెందున్
ముగురాడువార మైతిమి
వగపేటికి స్నానమాడ వచ్చినచోటన్.”
— చాటుధార

ఈమెయే యిట్లుండ నిఁక వీరమాతయగు యత్తగా రెట్టిదియో మనము నిక్కముగ నరయవలసినదే.

రణతిక్కన్న తల్లి ప్రోలమ్మ. ఈమె పట్టుదలయందు రేణుకను సమీతము దలదన్నిన యిల్లాలు. స్నానముచేసి భుజింప వచ్చిన తిక్కన్నకు విఱిగినపాలు పోసి — యిదేమని యడుగగా చెప్పిన సమాధాన మెంత గడుసుదనముగా నున్నదో చూడుడు.

కం. "అసదృశముగ నరివీరుల
మసిపుచ్చక విఱిగి వచ్చు మగపందక్రియన్
గసవున్ మేయఁగఁ బోయిన
పసులున్ విఱిగినవి తిక్క! పాలున్ విఱిగెన్." — చాటుధార

ఎట్టి పిఱికిపందకైన నీ పోటుమాటలు శరీరము తూట్లు పడునట్లు నాటునన్నవు డింక దిక్కన్న విషయము వేఱుగఁ జెప్ప వలయునా? వీరమాతయు; వీరపత్నియు నొక్కమాఱుగ నందించిన వీరసందేశములకుఁ దలయొగ్గిన తిక్కన్న రెండవ మాఱు యుద్ధమునకు మఱలి పోయెను. ఈ విషయమును స్ఫురింపజేసెడి కవిప్రశంస మిక్కిలి సంస్మరింపఁదగినది.

"పదనుమాటలు తాపి పసుపుముద్దలతోడ
పలికెఁ దనుత్రాణ మలికెఁ బత్ని
విఱిగినపాలతో తఱుగని శౌర్యాగ్ని
కల్పించె సుతునిలో గన్నతల్లి." —శ్రీ శ్రీనివాస సోదరులు

తుదకు దిక్కన్న సంగ్రామరంగమున విజయలక్ష్మిని జేపట్టెను; కాని సజీవుడై యింటికి మఱలివచ్చు భాగ్యము మాత్రము కఱవై పోయినది. బ్రహ్మరుద్రయ్య చేసిన మోస మేమో వీరస్వర్గమునకు దారిచూపినది.

ఆనాఁటి దొమ్మియుద్ధ మిద్విధముగఁ గవి ప్రశంసాపాత్ర మగుట మఱువరాని విషయము.

"పదటున వాజి రాహుత్తులపై దుమికించుచుఁ దిక్క డాసినన్
బెదిరి పరిభ్రమించి యటుపిమ్మట వీరులు భీతచిత్తులై
యదె యదె డాలు - వాల్మెఱుఁగు లల్లవె - అల్లదె యొత్తఁ డంచనన్
గొదుకక యాజిఁజేసె రిపుకోటుల కందఱ కన్నిరూపులై."

"చిక్కక మన్త్రసిద్ధి విభుచే మును గొన్న ఋణంబుఁ దీర్చె; మా
తిక్కనమంత్రి సోమశిల దేవరసాక్షిగఁ; బెన్న సాక్షిగా;
నెక్కిన వాజిసాక్షిగ; మహోన్నతికెక్కిన కీర్తిసాక్షిగా;
స్రుక్కక మారుకొన్న రణశూరుల సాక్షిగఁ; గొండసాక్షిగన్."

— చాటుధార

రణ రక్తబంధురారుణమైన ఖడ్గతిక్కన్న కత్తి, తుదకు ఖడ్గతిక్కన్నతోడనే పినాకినీ నదీజలముల విశ్రమించినది.

ఈ ఖడ్గతిక్కన కాశ్రయమిచ్చినవాఁడు మనుమసిద్ధి-చోళుఁడని ముందే పేర్కొంటిమి. కొన్ని చోట్ల నితఁడు 'సిద్ధిరా' జనియు వ్యవహరింపఁబడినాఁడు. ఏమయినను నితఁడు కాటమ రాజు కథలో 'పల్లవుడు'గఁ బేర్కొనఁబడినాఁడు. అసలితనికి యాదవుఁడగు కాటమతేఁతోడి కలిగిన సంగ్రామప్రసక్తియే లేదని మఱికొంద అనుచున్నారు. ఏదియెటులున్నను చరిత్రము మాత్రము ప్రాచీనవ్యవహృతమనుట నిర్వివాదాంశము. కాగా వివాదగ్రస్తమగు విషయము మాత్రము విమర్శకలోకమునకు వదలివేయఁబడినది.

ఈ కావ్యమును వ్రాయుటలో చెన్నపురి త్యాగరాయ కళాశాలాంధ్ర ప్రధానోపన్యాసకులగు శ్రీ తిమ్మావజ్ఝుల కోదండ రామయ్యగారి యమూల్యవ్యాసరాజమే నాకు మిక్కిలి దోహద మొనరించినది. వ్యాసకర్తలగు శ్రీ కోదండరామయ్య గారి కెంతయును గృతజ్ఞుఁడను.

మదీయ శ్రేయోఽభిలాషులును; శివభారత కర్తలును; మహాకవి బిరుదాంచితులును నగు బ్రహ్మశ్రీ గడియారము వేంకటశేషశాస్త్రిలవారి వాత్సల్యపూరితాభినందన పద్యములు నా కావ్యమునకే కాక నాకును మెఱుగులు దిద్ది నన్నాశీర్వదించిన వనుటలో నెంతమాత్రమును సందియము లేదు. శ్రీవారికి సర్వదా కృతజ్ఞుఁడను.

ముద్రణవ్యయమును భరించిన మహోదారుల నామో చ్చారణమునకైన నోచని నేను నిక్కువముగ కృతఘ్నుఁడను. అమ్మహోదారుని శాసనముచేఁ దన్నామ ముచ్చరింపఁబడనందు లకు నన్ను పాఠకలోకము మన్నించును గాక !

మిగిలిన వ్యయములకై విరాళము లొసంగిన దాతల కెల్లరకును మిక్కిలి కృతజ్ఞుఁడను. ♦ వారి నామములు మాత్ర మీ క్రిందిభాగమునఁ బొందుపరుపబడుచున్నవి.

ఈ వదాన్యుల కెల్లర కాయురారోగ్యైశ్వర్యములను ప్రసాదించుఁగాతమని నిత్యము శ్రీరాధాకృష్ణుని బ్రార్థించు చుందును.

---

♦ 1. చిరంజీవి పెట్టము చెంగల్వరాయరెడ్డి, చిఱునంబూదూరు. (చెంగల్పట్టు జిల్లా) — రు 58/-

2. శ్రీ రాఘవరాజుగారు. మేనేజరు, ఈగవారిపాలెము. (చెంగల్పట్టు జిల్లా) — 25/-

3. శ్రీ పి. వి. వడివేలు మొదలియారుగారు, పూలంబేడు. — 25/-

4. శ్రీ పన్నెం దామోదరశెట్టిగారు. పంచాయితీబోర్డు ప్రెశిడెంటు, పత్తిపేడు. — 25/-

సకాలములో ముద్రించియిచ్చిన తెనాలి జానకీరామ ముద్రాలయమువారి కెంతయుఁ గృతజ్ఞుఁడను.

ముద్రణావసరమున సాధ్యమగునంతవఱకు నెఱసులు దొఱలనీయక కావ్యమున కొక క్రొత్తదన మాపాదింపఁ జేసిన మన్మిత్రములును, బండితవరేణ్యులు నగు శ్రీయుతులు బులుసు సూర్యప్రకాశశాస్త్రులవారికి సర్వదా కృతజ్ఞుఁడను.

అల్పజ్ఞుఁడ నగు నా దోషములే మిక్కిలి దొఱలినవని చింతిల్లుచుండ నచ్చటచ్చటఁ గనవచ్చు నచ్చుతప్పులు గూడఁ గొన్ని తోడయినవేమో యని నా యనుమానము.

పండితప్రకాండు లీ గొడవలను దడవరని విశ్వసించుచుఁ బామరులనుమాత్ర మీ నెఱసులజోలికిఁ బోవలదని శిరసా ప్రణమిల్లి ప్రార్థించుకొనుచున్నాఁడను.

ఈ చిఱుతకావ్య మొక నిముసమేని బాలకలోకమునకుఁ బ్రమోదమిడునేని మిక్కిలి ధన్యుఁడను. ఏమనిన ఆ ప్రమోదమే పునర్దర్శనమునకు నాకుఁ దావలమగును గదా!

ఇట్లు
బుధజన పాదరేణువు
చల్లా లక్ష్మీనారాయణశాస్త్రి

పత్తిపీడు
1-1-1956



గ్రంథకర్త

చల్లా లక్ష్మీనారాయణశాస్త్రి

శివభారత రచయితలును, మహాకవి బిరుదాంచితులును నగు

## బ్రహ్మశ్రీ గడియారము వేంకటశేషశాస్త్రిగారు

వాత్సల్యమున వ్రాసి పంపిన

# ప్రశంసాపద్యములు

శ్రీ రణతిక్కన కావ్యకర్తలు బ్రహ్మశ్రీ చల్లా లక్ష్మీనారాయణశాస్త్రిగారికి

అభినందనములు.

ఆనందించితి నీ కవిత్వ మధురవ్యాహారముల్ వించు ల
క్ష్మీనారాయణశాస్త్రి! నీ రచనలో శ్రీ ఖడ్గతిక్కన్న బా
హానృత్యత్కరవాల కృత్తరిపు శీర్షాగ్రోత్పతద్రక్త ధా
రానిర్వ్యూహమునట్టులై సహజధారాశుద్ధి పొల్పారెడిన్.

పరదాస్యంబున మ్రోడువారి నవభావస్ఫూర్తికర్త్రైన యీ
భరతక్షోణిఁ బునఃప్రరూఢ జవసత్వస్థైర్య వీర్యాది వి
స్ఫురణంబుల్ వెలయింప వీరచరితంబుల్ వీరకావ్యంబులై
యరుదేరందగు నేఁడు నీ కృతి విశాలాంధ్రోత్సవం బందెడున్.

ఘనుఁడౌ వేంకటశాస్త్రి దేశికుఁడుగాఁ గావ్యంబు శాస్త్రంబు నే
ర్చిన నీ విద్య, సుకావ్యకన్యకలఁ గాంచెన్ గంటి నీ వృత్తమున్
దనయున్ బండితు సత్కవిన్ రసికు రాధాకృష్ణు; ధన్యుండవై
మను మయ్యా నిజసంతతిస్తుత యశోమాన్యత్వ మేపారఁగన్.

ప్రొద్దుటూరు
14-9-1955

ఇట్లు,
గడియారము వేంకటశేషశాస్త్రి

శ్రీ మత్పరదేవతాయై నమః

# హరిహరనాథ స్తుతి

♦శ్రీలం దనర్చు కౌస్తుభముచే నిజకంఠ మలంకరించె దో;
లీలగ నస్థిమాల మొదలే యెదఁదాల్చెదవో; యశోద చన్
బాలు బసందుజేసెదొ; సవాలొనరించి విసంబుద్రావెదో;
రాలునె ముత్తెముల్ హరిహరప్రభు ! నీమతమేమొ తెల్పుమా.

## హరి స్తుతి

శ్రీలలితమ్ము మౌళి శిఖరీకృతపింఛముఁ; జంచరీక నీ
లాలక జాలరమ్యవదనాంబురుహమ్ము; సలీలమత్తశుం
డాల విలాసలాస్యగమనమ్ము; లసన్నయనమ్ము; రాధికా
లాలిత నీలగాత్ర సమలంకృతమెంచెదఁ గృష్ణతేజమున్.

## హర స్తుతి

హర ! నీమేనిసరాల మేల్ బుసబుసల్; వ్యాగ్రాత్తమై గౌరి, యే
మరకే నీ చెవినింపు నా గుసగుసల్; మందాకినీ దేవి, శాం
కరిపై కయ్యముఁదార్చు నారొసరొసల్; గయ్యాళియిల్లాండ్రతో
సరిబేసిన్ జెలగాడు నీశశభిషల్ చర్చించునే మామొఱల్ !



♦శ్లో॥ కిమ స్థిమాలామ్; కిము కౌస్తుభం వా; పరిష్క్రియాయామ్ బహుమన్యసేత్వమ్
కిం కాలకూటః; కిము వా యశోదా స్తన్యమ్ తవస్వాదం వద ప్రభో! మే.

— ఆంధ్రమహాభారతము.

శ్రీమత్పరదేవతాయై నమః

# ర ణ తి క్క న

## ప్రథమ పరిచ్ఛేదము

### కథావతరణ ప్రశంస

శ్రీ వసుధారమణీ సం
భావితమణిహారమధ్యమణినాఁ బొగడం
గా విక్రమసింహపురం
బీ వసుధన్ వెన్నదఱిని నెంతయుఁ బోలుచున్.

రంగదభంగ మంజుల తరంగ పరంపర రమ్యడోలికా
ప్రాంగణసీమఁ బ్రేమఁ జెలువార సమీరకుమారవార ము
ప్పొంగఁగ నిల్పి యూఁపుచు సమున్నతిఁ దన్పి పయఃకణంబులన్
మంగళదేహ యొప్పెడు సుమా! మన పెన్న నవప్రసూతయై.

అనురాగ మొలుకు తీయని సుధారసధార
లలరించు నడల నింపొలయు చెలువ
ధవుఁడా పినాకి కెంతయుఁ గూర్చు సతియై పి
నాకినీ ఖ్యాతిఁ గొన్న సుచరిత్ర

తన్నాశ్రయించు భూతవితానముకు మే
    లొనరించు భవ్యపయోనిధాన
పాడిపంటలఁ గూర్చి పాలవెల్లిగ నొప్పి
    కన్నబిడ్డలఁ దన్పు కల్పవల్లి
ధవుఁడు మిన్నకుంట సవతుల పలుకుల
కలిగి యన్నతోడఁ బలుకఁ దలఁచి
మలగి రంగనాథు మందిరంబున కంటి
పెనఁగి దిరుగుచుండు బెన్న సతము.

కనులన్ జల్లనిచూపు లుల్లసిల్ల రంగస్వామి, శేషాహి శ
య్యా మయూలూగుచు లచ్చికంఘ్రులిడు చోయ్యన్ జెల్లెల్గున్ బూసగ్రు
చ్చినయట్టుల్ వినిపించుచుండిన గృహచ్ఛిద్రమ్ము లూఁ కొట్టుచున్
వినుచున్నాఁడదె — స్త్రీల కాప్తజన మిర్వన్ గాదె తోఁబుట్టువుల్.

విహగవాహనుఁ డిపుడు కావేరి యనెడు
చెలియలిన్ జూచి తన చిన్నచెలియలి నిట
జూడ నేతెంచె నేమొ విశేషయుక్తి
గానియెడ నిట్లు తీరికఁగాఁగ వినునె!

పనిగా రావణుఁద్రుంచి వేల్పులు నుతింపన్ మాటపట్టింపునన్
దన భక్తావనతానిదర్శనముగాఁ దద్రాజ్యపీఠిన్ విభీ
షణునిన్ నిల్పినవాఁడు మున్నగుట; వాత్సల్యాప్తి నేఁ డాతనిన్
గని విచ్చేసి పరుండె నేమొ శ్రమచేఁ గాకున్న నిట్లుండునే!

అని లోకమ్ము నుతింప బొజ్జనిడి బ్రహ్మాండంబులన్; యోగ ని
ద్రను భక్తావన దీక్షఁ బన్నగఫణాతల్పంబునన్ బండి ల
క్ష్మి నిజాంఘ్రులన్ భజియింపఁ; బద్మభవునిన్ సృష్టించి నిశ్చింత హా
యిని గైకొన్న జగత్ప్రభుండు మన రంగేశుం డితండే కదా!

కుంఠీభూతముగాని భక్తి హరిభక్తుల్ వెంటఁ గీర్తింప; వై
కుంఠైకాదశినాఁటి యుత్సవముఁ గన్గొ నెంచి విచ్చేసి సో
త్కంఠాప్తిన్ మన మన్మసిద్ధి, కవితిక్కబ్రహ్మతోఁ గూడి వై
కుంఠున్ బాడిఁ గృహమ్ముఁ జేర విబుధోక్తుల్ బర్వ నాశీస్సులై.

కవియును మన్మసిద్ధియు సుఖమ్ముగ రాజగృహమ్ము సొచ్చి నం
త — వెనుకనుండి వచ్చు వనితామణు లారతి పళ్లెరంబులన్
దవిలిన పూలుఁ గైకొని ముదమ్మున నౌదలఁ జేర్చుకొంచుఁ దా
మవిరళభక్తి నిర్వురు గృహమ్మునకున్ జనుచుండ దర్శిలిన్.

—: రాజవేశ్య :—

దాసి మంజువాణి దనకు మార్గము సూప
వెనుక నడచివచ్చు వేశ్యఁ గాంచి
మనుమసిద్ధి ప్రేమ మదిఁ గొన్న కలవాణి
యనుచు జనము లాడికొనిరి మురిసి.

ఎంతటి సోయగమ్ము — కనులింతలు — కన్బొమ లందమంటె మా
కంతుని విండ్లనే కసరుగా — మఱి చూపులుఁ దూపు లౌనుగా;
కింతకు శ్రీసఖమ్ము లవునే — చెవులున్ మకరాంకితమ్ములై;
యెంతకు లేదు జాణ మదికెక్కిన యీ కలవాణి వాణియే!

చదువులలో సరస్వతి, వచస్సులలోన బృహస్పతిన్ బదిం
బది నిరసించు సన్మతి — దినస్పతితోఁ దులఁదూగు భూరి సం
పద సలరారు భాగ్యవతి — మంజుల నాట్యకళావినోద సం
పదను ఘృతాచి నెన్నని ప్రభావతియై — కలవాణి యొప్పెడిన్.

అని జనముల్ నుతింపఁగ వయస్యను గూడి విలాస వైఖరిన్
దన గృహసీమకున్ జని ముదమ్మున స్నానముచేసి భోజనం
బును ముగియించి తీరికగ ముచ్చట లాడుచు వీడె మంది వే
డ్కను గలవాణి పెంపుడుశుకమ్మును బిల్చెఁ దదుక్తిమాధురిన్.

పిలిచిన యంతమాత్రమునఁ బెంపుడుతల్లి కలస్వనమ్ముచే
నలరుచు మాఱుపల్కుల హాయియల్ వెదజల్లెడు తేటమాటలన్
బలుకుచు వచ్చివచ్చి తన పైన గుభాలున వ్రాలునట్టి రా
చిలుక యదేమొ నేఁ డట్టుకఁ జేరమి వేశ్య వయస్యకిట్లనున్.

—: వేశ్యచిలుక :—

మంజువాణి! నేఁడు మన రామచిలుక యే
చాయ కరిగె దాని జాడఁ దెలిసి
కొని బిరానరమ్మ కొండంత యాసతో
బెనుచుకొంటి నమ్మ పెద్దచేసి.

అని పలుకునంత ముంగిట
గొణగొణమను నెలుఁగుతోడఁ గొణుగుచు శుక మ
ల్లనఁ దన యెద నాటిన స
న్నని బాణపుములికి కదలెనా యన వ్రాలెన్.

వ్రాలిన చిల్కనెత్తి కలభాషిణి తత్తర మంది యార్తిమై
సోలుచు వ్రేళ్లవైచి మెడఁ జూడ్కి నిగుడ్చుచుఁ దేల కన్నులన్
జాలిగ జూచు దాని కనుజాడల చూపులెఱింగి, ఱెక్కలన్
మాలిమి దువ్వి లేఁజిగురు మావిచిగుళ్లను బోలు వ్రేళులన్.

దువ్వి కనుంగవన్ దొఱఁగు దోరపు నశ్రులఁ జేవిదల్చి తే
జవ్వని రెండు ఱెక్కలకు జాలుగ నాటిన వాఁడితూపుచే
నివ్విధి బాధ జెందె నని యెంచి సుదీర్ఘ విలపించి వెఱ్ఱిగా
గెవ్వున గేక వైచి పరికించి తటాలున దీసె బాణమున్.

తీసి శరమ్ముఁ గేల్వడఁక దేకువ సాకిన ప్రేమ — జాలితో
నా సరసీరుహాక్షి వెఱగందుచు నింతటి బాధకోర్చెఁగా
నా సుకుమార కీరము రణస్థలి కేగి శరప్రహార సం
త్రాసముతోడ వచ్చిన విధమ్మును దోచె నిదేటి చిత్రమో !

అని చివాలున బాణాగ్రమందు దనరు
పేరు దిలకించి చదివి యివ్వేటగాని
రోగ మడగింతు నంచు సరోషచిత్త
యగుచు ముఖమెత్తి భాషించు నంతలోన.

కీరము వెంబడించి పరికించుచు వచ్చి యెటో గృహమ్ము సిం
గారముఁ గాంచి చేరిన యొకానొక పిట్టలవేటగాని సిం
గార మెలర్పగా బసులకాపరి యొక్కఁడు వెఱ్ఱిమొఱ్ఱిగా
గీరమువంకఁ జూపులు లగించుచు నక్కుచు నిల్చె వాకిటన్.

చదువులలో సరస్వతి, వచస్సులలోన బృహస్పతిన్ బదిం
బది నిరసించు సన్మతి — దివస్పతితోఁ దులఁదూఁగు భూరి సం
పద గలరారు భాగ్యవతి — మంజుల నాట్యకళావినోద సం
పదను ఘృతాచి నెన్నని ప్రభావతియై — కలవాణి యొప్పెడిన్.

అని జనముల్ నుతింపఁగ వయస్యను గూడి విలాసవైఖరిన్
దన గృహసీమకున్ జని ముదమ్మున స్నానముచేసి భోజనం
బును ముగియించి తీరికగ ముచ్చట లాడుచు వీడె మంది వే
డ్కను గలవాణి పెంపుడుశుకమ్మును బిల్చెఁ దదుక్తిమాధురిన్.

పిలిచిన యంతమాత్రమునఁ బెంపుడుతల్లి కలస్వనమ్ముచే
నలరుచు మాఱుపల్కుల హొయల్ వెదజల్లెడు తేటమాటలన్
బలుకుచు వచ్చివచ్చి తన పైన గుభాలున వ్రాలునట్టి రా
చిలుక యదేమొ నేఁ డట్టుగఁ జేరమి వేశ్య వయస్యకిట్లనున్.

—: వేశ్య చిలుక :—

మంజువాణి! నేఁడు మన రామచిలుక యే
చాయ కరిగె దాని జాడఁ దెలిసి
కొని బిరానఁ గమ్ము కొండంత యాసతో
బెనుచుకొంటి నమ్మ పెద్దచేసి.

అని పలుకునంత ముంగిట
గోణగోణమను నెలుఁగుతోడఁ గొణుగుచు శుక మ
ల్లనఁ దన యెద నాటిన స
న్నని బాణపుములికి కడలెనా యన వ్రాలెన్.

వ్రాలిన చిల్క నెత్తి కలభాషిణి తత్తర మంది యార్తిమై
సోలుచు వ్రేల్వైచి మెడఁ జూడ్కి నిగుడ్చుచుఁ దేల కన్నులన్
జాలిగ జూచు దాని కనుజాడల చూపులెఱింగి, ఱెక్కలన్
మాలిమి దువ్వె లేఁజిగురు మావిచిగుళ్లను బోలు వ్రేళులన్.

దువ్వి కనుంగవన్ దొఱఁగు దోరపు నశ్రులఁ జే విదల్చి తే
జవ్వని రెండు ఱెక్కలకు జాలుగ నాటిన వాఁడితూపు చే
నివ్విధి బాధ జెందె నని యెంచి మదిన్ విలపించి వెట్టిగా
గెవ్వున కేక వైచి పరికించి తటాలున దీసె బాణమున్.

తీసి శరమ్ముఁ గేల్వడఁక దేకువ సాకిన ప్రేమ — జాలితో
నా సరసీరుహాక్షి వెఱగందుచు నింతటి బాధకోర్చెఁగా
నా సుకుమార కీరము రణస్థలి కేగి శరప్రహార సం
త్రాసముతోడ వచ్చిన విధమ్మును దోచె నిదేటి చిత్రమో!

అని చివాలున బాణాగ్రమందు దనరు
పేరు దిలకించి చదివి యువ్వేటగాని
రోగ మడగింతు నంచు సరోషచిత్త
యగుచు ముఖమెత్తి భాషించు నంతలోన.

కీరము వెంబడించి పరికించుచు వచ్చి యెటో గృహమ్ము సిం
గారముఁ గాంచి చేరిన యొకానొక పిట్టలవేటగాని సిం
గార మెలర్పగా బసులకాపరి యొక్కఁడు వెట్టిమొట్టిగా
గీరమువంకఁ జూపులు లగించుచు నక్కుచు నిల్చె వాకిటన్.

నిలచినవాని గాంచి తన్వీమణి లేచి కఠోరభాషణం
బొలయ వచించె నిల్లవఁడ వోరి కిరాతక ! రామచిల్కకై
యలఘుశరమ్ము వైవ నెటులాడెర చేతులు — నిన్ను బోరికిన్
బిలిచెనె — నోరులేని పసిబిడ్డలు నీకును గల్గి యుండరే!

అలయిక జెంది లేయరటి యాకుల దొప్పలవోని ఱెక్కలన్
విలవిల దన్నుకొంచుఁ గడుభీతిని గూయిడుచున్ శరాగ్నికిన్
మలమల మాడి ప్రాణములుమాత్రము గుప్పిటఁ జిక్కఁబట్టి యీ
నెలవున కేగుదెంచెఁ గద ! నీచుఁడ ! యీ యుసురేల గొట్టెదో !

మఱల నిదేమి పాప మిటు మాంసముఁ గోరి శుకమ్ము వెంటనే
తరలితి వెంత దుర్మతివొ తాల్మివహించితి నింతదాక నీ
వరుగు మికేని — లేనియెడ వ్యర్థముగా చెడిపోదు ఇంతకీ
శిర మిదె కోటకొమ్మకుఁ బ్రసిద్ధముగా నెలకొల్పనీకుమా !

—: చిలుక బాణపుదెబ్బతో గుఱియగుట :—

విని విని వాఁడిటుల్ పలికె వేసరి — వేశ్యవు నీవు, ఱేఁడు నీ
పనిచిన కార్యముల్ జరుపు బానిసగాఁడు — కొఱంత లేదు నీ
పనిన విధానఁ జేయఁగల వంతయుఁ బ్రాణముమీఁది తీపి నా
కును మొదలే హుళక్కిగద కోప మిఁకేటికిఁ జెప్పు మమ్మరో !

కొసరుచుఁ గోసి నా శిరము గోటకుఁ గట్టినఁ గట్టవచ్చు — నన్
మెసవు మృగాళి గల్గునెడ మేఁతకు వేసిన వేయవచ్చు — నే
దెసకయినన్ ననున్ బనిచి తేకువఁ జంపినఁ జంపవచ్చు — నే
వినమిడియైన నన్నిటను వెళ్లఁగఁదీయుము బున్నముండెడిన్.

పసులను మేపువాఁ డిటులఁ బల్కిన పల్కుల కుల్కి వేశ్య — నా
పస నడఁగింప వీఁ డెవఁడొ పజ్జకుఁ జేరినవాఁ డటంచుఁ దాఁ
బసదన మిచ్చి యెక్కుడు సపర్యలొనర్చి మృదూక్తిఁ దండ్రి! నా
దొసఁగులు సైచి చెప్పు మిఁక దూర్ణముగా మఱి నీ యుదంతమున్.

అన విని సంతసిల్లి యొక యాసనమం దుపవిష్టుఁడై యతం
డని నిటు తేటమాటల మదంబ! వినంగఁ దలంచితేని నా
యనుచిత సాహసోక్తులు క్షమార్హములై చన నాలకించి నా
కును గడు సంతసమ్ము నొనఁగూరిచి తోఁచినయట్లు సేయుమా.

ప్రకృత మనుసరింతుఁ బల్లదమ్ము లటంచు
నాదు నుడుల కలిగి నన్ గలంచి
కడు నుపద్రవమ్ము గలిగింప కుభయతా
రకము గాఁగ కార్య మొకట నడుపు.

—: కాటమరాజు :—

కాటమరాజు నాఁబడు నొకానొక యాదవవంశభూషణుం
డోటమి లేని శౌర్యమున నొప్పుచు బాహుపరాక్రమ క్రమో
త్పాటిత శాత్రవుం డయి యపార మదమ్మున గొల్లలెల్ల బా
హాటముగా భజింప ససహాయత నుం డెఱగడ్డ పాటిలోన్.

గరుడ శార్దూలబిరుదమ్ము కనకపడగ
బిరుదమున్, జంద్రబిరుదమ్ము, విష్ణుబిరుద,
మజ్జబిరుదమ్ము, బ్రళయకాలానలాఖ్య
బిరుదముల నొప్పుఁ గాటమవీరుఁ డుర్వి.

నరవరుం డౌటచే నల నన్న యనియు;
నాలఁ గాచుటచే నాతం డన్న యనియు;
బసుల మేపరియాటచేఁ బసువు లన్న
యనెడు నామమ్ములమరు నయ్యవనిపతికి.

వేల్పులెల్లరు గొల్లలై వెలసియుండ
ద్వాపరమ్మునఁ గృష్ణుఁడై తనరె శౌరి;
గ్రాలె నా శౌరి యిక్కలిఁ గాటముఁ డయి
యచ్యుతానంద గోత్రజుఁ డగుచు నలరి.

తండ్రి పెద్దిరాజు; తల్లి పెద్దిమదేవి;
కాంత మర్లవారి గంగమాంబ;
పాప నూకమాంబ భగినిగాఁ గాటమ
నృపతి యాదవులకు నృపతి యయ్యె.

అతనికిఁ బద్మనాయఁ డను నాప్తుఁడు వెల్మకులోద్భవుండు సంతతహిత చింతకుం డగు ప్రధాని యొకండు గలండు గార్య శూరతయును ఖడ్గశూరతయు రాజిల యుద్ధమునందు; బావయై చతురతమించు గొల్లఁ డయి చాలఁ బ్రియం బిడుచుండు తేనికిన్.

చల్లసోదరు లేవురు గొల్లవారల;
లందుఁ బిన్నమనాయఁడే యగ్రజుండు
గాటమత్పొమధవునకు సంగాతకాడు
మాత్రమే కాక యతఁడు సామంతరాజు.

బ్రహ్మరుద్రయ్య జంగమబ్రాహ్మణుండు
లింగధారియ కాని పాలింపునేర్పు
గలిగి యెఱగడ్డపాటి భూకాంతవాళి
కియ్యె సేనాని వేదవిద్యానిధాని.

పొదుగు లేప్రొద్దు దుగ్ధసంపూర్ణ కుంభ
నిశరమై యొప్ప గోమాతృనికర, మతని
గొలుచు గోపాలకృష్ణుఁ డం చెలమి; జేసి
కదియె చతురంగబలము; సంపదయు నదియె !

తృణ జలపూర్ణమహా వసుమతీ తల మెల్లరయు సస్యయుక్తమై
తనరిన నాటినుండి పశు తండము గమ్మని మేఁత మేసి తీ
యని జల మాని భూరుహ చయంబుల నీడల విశ్రమించి ప
ర్వన చలిగాలికిన్ నెమరు వేయుచు హాయిగ విశ్రమించెడున్.

### పశువులగోడు

మొన్నటిదాఁక సౌఖ్యముగ మొత్తము మీఁదఁ బశుప్రకాండ మే
తెన్నున బోవకే వసుమతీస్థలి చల్లని చూపులోని కన్
సన్నలలో మెలంగెఁగద సాగినయంతకుఁ గాటిజేని మేల్
పున్నెమునన్ - నశించినది హో - యిపుడయ్యది యేమిపాపమో. !

క్షేమదేవత నెడలుచు క్షామదేవ
తను బ్రతిష్ఠించి వెడలె స్వస్థాన మందు
దానఁ గాటక మొనఁ గూడె దానికేమి
గాని కఱ వేర్పడెన్ బశుగ్రాసమునకు.

వానలు వట్టిపోఁ బసరుఁ బచ్చికబైళులు బీళ్లువార మా
గాని పొలమ్ములెల్లఁ గొఱగాని తృణమ్ములు ముళ్లదుబ్బులున్
వేనకు వేలుగా బలిసి వేరులు బారులుగాఁగ సాగి యే
గానికిమారకుంట హాలికవ్యవసాయముఁ దెల్లవారెఁగా.

కాయము దూలిపోవఁ గల కాలము గర్షకవృత్తి దస్సియే
సాయముఁ గానరామి వ్యవసాయకు లెల్లరు జల్లిగాని యూ
దాయము లేమి బండపయి దాకిన పెంకనఁ బిల్లజల్లతో
డాయలతోడ నేగిరి యథాతథలై తల కొక్కమూలకున్.

తన ప్రజ లిట్టి దుస్థితికి దాపురమై వసివాడుచుండ న
జనపతి కాటమ ప్రభువు సాయముఁజేసి ప్రజార్తిఁ బాపనే
ర్చిన ఘనుఁ డయ్యె; గోగణము చింత యొకింతయు బాపడయ్యె
తని తరమానె - తే కతని తాత తరమ్మె విధిన్ మఱల్పఁగన్.

ఈవిధమైన నింకఁ బసులే చెడిపోయినఁ బోవు నంచు నా
భూవిభుఁ డెంచి నర్మసచివుండయి మించెడు పద్మనాయనిన్
బావను దోడు జేసికొని పైన మొనర్చుచు మన్మసిద్ధి ధా
త్రీ విభుతోడి సఖ్య మొనరించుకొనన్ వడిఁ జేరెఁ దత్పురిన్

నాటికి నాఁడె పైన మయినన్ బురియందున మన్మసిద్ధి నా
కాటమరాజు గన్గొనక గానలలోఁ బడిపోయి పోయి పా
లేటితటాన నొక్కవట వృక్షము నీడను గొల్వు దీరి బా
హాటముగాఁ బ్రజాదరము లందెడు నమ్మనుజేశుఁ గన్గొనెన్.

కనుగొని సాష్టాంగముగా
ప్రణతులు గావించి లేచి ప్రాంజలి యాచార్యా
మనవి యొనరించె నెల్లరి
మనుజేశునితోడఁ గాటమప్రభు విట్లనన్.

**మనుమసిద్ధి కాటమప్రభువుల సంభాషణము.**

విక్రమసింహ పురీశ్వర !
విక్రమ విజితారివీర ! వేదవిచారా !
శక్రోపమ ! సకలదిశా
చక్రపరీతైక కీర్తిసాధ విహారా !

అవధరింపంగదయ్య మహానుభావ !
వర్ష మెట్టిదో యెఱుఁగ మీవర్షమందు
పైరుఁబచ్చలు నశియించెఁ బాడిపంట
లెల్ల వెనుకాడెఁ బసువులు దల్లడిల్లె.

చిగురుల్ వెట్టెడు బచ్చికల్ మొదటికే క్షీణించెఁ బైపెచ్చుఁ జ
క్కఁగ దున్నించిన చేలలోని పయిరుల్ గన్పించవయ్యెన్ వరి
ద్రగుణాలంకృత శోకదేవతకు నృత్యస్థాన యోగ్యంబనన్
దగి యొప్పారె స్వరాష్ట్రమెల్లఁ బశుబృందం బింత కల్లాడఁగన్.

ఆకు లలములు భుజియించి యలమటించి
ప్రజలు నిల్చిరి గుప్పిటఁ బ్రాణములను
జిక్కఁ బట్టుచుఁ గుమిలి కృశించి యెట్లొ
నోరులేనట్టి పసులకానో - మహాత్మ !.

పసులకు మేఁతఁ గోరి మఱి బ్రాణము లేని పణంబు నొడ్డి యే
దెసకయినన్ భిరానఁ జని దీనతకున్ దలయొగ్గి యెట్టులో
కసవుగడించి గోవుల సుఖస్థితిఁ దప్పినఁ బున్నె ముండు నం
చసువులఁ జిక్కఁ బట్టి భవదాశ్రయ మందితి మింత కో ప్రభూ!.

పాలన్ ముంచిన నీటముంచినను నీ భారమ్ము వేయేల నా
కే లీలన్ బశురక్షణైక భరణంబే ముఖ్యకర్తవ్యమై
క్రాలన్ బున్నెము గట్టుకొమ్ము మనలోఁ గన్పట్ట దేవైర మిం
కేలా జాలము - పుల్లరిన్ గొనుము నీ కింకేల శంకింపఁగన్.

కరుణన్ మేఁతకుఁ బుల్లరిన్ గొని పశుగ్రాస ప్రదానంబు నే
కరణిన్ జేసిన మాకుఁ జాలనుచుఁ బొంకం బాడ నర్మోక్తి న
క్కఱమై వేడిన కాటమప్రభుని వాక్యంబుల్ దయన్ జోళభూ
వరుఁ డాలించి వచించె నిట్టుల మహాత్వ ప్రాభవ ప్రౌఢిమన్.

ఓమహానీయ! తావకమృదూక్తికి నాహృదయ ప్రమోదమే
ప్రేమగ మారి సాయ మొనరింపఁ గుతూహలమున్ జనించె న
య్యా మమతన్ బశు ప్రకర మాపదకున్ గుఱియయ్యె నంచు నీ
వేమొ వచింతు; నా కది సహించు నె - నేనును మానవుండనే.

గోవుల్ నీకును దల్లు లైనటుల నాకున్ గావొ - పుత్రుండ వౌ
దీవే - నీకు సహోదరుండ నగుచో నేనున్ మఱిన్ నీవు గా
మో వారిన్ మన మన్నదమ్ములము రమ్మో తమ్ముఁడా! నీకుఁ
గా - నే వేఱే వచియింపఁగావలెనే లేదే చింత నీకింతకున్.

వలసినంత మేఁత బైరుఁ బచ్చిక బీళ్ళుఁ
గలవు; త్రావ నీరుఁ గలదు పెన్న;
గోగణమ్ము మేసి గోపాలకుఁడ వైన
నిన్నుఁ గొల్చుఁ దరుల నీడ నిల్చి.

నాఁడు గోగణమ్ము నవనీత చోరుఁడౌ
నందసుతుని స్నేహ మంది నట్లు
నేఁడు గోగణమ్ము నిన్ను గోపాలుఁగా
దలఁచి ప్రేమ సతముఁ గొలుచుఁ గాదె!.

ఫుల్లరి కింత లేసి సుమవుల్ నుడువన్ బనియేమి తండ్రి! నే తెల్లముగా వచించితిని దీరెఁ గొంత పథశ్రమమ్ము చేఁ దల్లడ మంది నాఁడవు గదా! యిఁక స్నాన మొనర్చి భోజనం బల్లనఁ జేసి రమ్ము మన కాపయిఁ దీరెడు మీఁదికార్యముల్.

అని చింకిర్ల కులోద్భవుం డయిన భీమన్నన్ నిజాప్తైక మిత్రుని దోడిచ్చిన; మన్మసిద్ధి దయ కెంతో సంతసం బంది చయ్యనఁ జేరన్ దనబావ వెల్మకులజుం డౌపద్మనాయండు వెంటను బై నింప - భుజింపఁ గాటమధరానాథుండు పెల్లుబ్బుచున్.

చేరి భోజనమ్ముఁ జేసి తాంబూల చ
ర్వణ మొనర్చి తిరిగి మనుమసిద్ధి
దటికిఁ జొచ్చి ప్రేమ దళుకొత్తు పలుకుల
బలుకు తనదు తేవి భావ మరసి.

— పుల్లరియొడంబడికలు —

ఆలోనన్ మధురోక్తి వెల్మకులజుం డౌ పద్మనాయండు దా
నాలోచించి వచించె నిట్టుల మహాత్మా! మన్మసిద్ధిప్రభూ !
మీలో మీకిపు డేయొడంబడికలో మీరిర్వురున్ జేరి ప
ర్యాలోచించి వచింపు డింకఁ దడ వేలా- పత్రముల్ వ్రాసెదన్.

అన్నదే చాల టంచు భీమన్న పలికె
నిటుల మీజేని భావము లీ వెఱుంగు
దింక మాజేని భావము లేనెఱుంగు
ధుఁగద - పత్రము వ్రాయనేర్తును మనమును.

మాకుఁ దగిపోయి రనుచు సన్మానదృష్టిఁ
బఱపు చోఁడోరు వాత్సల్యభావ మలర
మనుమసిద్ధియుఁ గాటమ మనుజవిభుఁడు
నర్మసచివులఁ గన్గొని నవ్వి కొసిరి.

సిగ్గిలి నవ్వుకొంచు వికసించిన భావము లోఁడోరుల్ దగన్
దిగ్గనఁ గల్పికొన్న తమ నేతల మోములు గాంచి మంత్రులున్
నెగ్గిన పెగ్గ లేర్పడ గుణించిన వక్కణ రాగిరేకులన్
నిగ్గులు దేరు కల్పనల నేర్పున వ్రాసిరి కౌలుఖత్తులున్.*

---

* ఈనాందారు రైగుచే వ్రాయించుకొనిన పత్రమునకు "కౌ"లనియు, రైతున కీనాందారు వ్రాసియిచ్చిన పత్రమునకు "ఖ"త్తనియుఁ బెద్దల సాంప్రదాయము.

ఎల్లపశువులు నెల్లూరి నల్లమల య
డవుల మేసిన మేఁతకుఁ గవులు; ఖత్తు
లను గుణమ్ముగఁ బద్మ భీమనలు వ్రాసి
వేలువేలుగఁ దమతమ విభుల కిడిరి.

ఇడిన యంతనె తానొడంబడికఁ జదివి
దూడ లాఱును నూటేసి మాడలుఁ బ్రతి
వత్సరంబున కిచ్చెడువైన మరసి
చేసి చేవ్రాలుఁ గాటమక్షితి విభుండు.

మనుమసిద్ధి కొసంగ నమ్మనుజ విభుఁడు
దాని దిలకించి మెచ్చి భద్రమ్మొనర్చి;
అట్టి విధులను వ్రాసి భీమన్న యిడిన
కాలుపై వ్రాలు చేసి పొంకమ్ము మీర.

కాటమజేని కీయ ఘనకార్య మొనర్చినవాఁడు వోలె బా
హాటముగాఁగ నందికొని యంజలి వట్టి నమస్కరించుచుఁ
గాటపు భక్తిమై సెలవుఁ గైకొని బావయుఁ దోడుఁ గాఁగ న
వ్యేటిని దాటి కాల్నడక నేగెనుగా నెఱగడ్డపాటికిన్.

నాటినుండియు నెల్లూరి నల్లమల య
డవుల లోని బయళ్ళఁ గ్రొంజివురు జొంప
ములును మేయుచుఁ గాటమభూమివిభుని
యాలమందలు నెమరువేయంగఁ దొడగె.

కడచెన్ వత్సర మీాగతిన్ బసులకున్ గ్రాసమ్ము సంపూర్ణమై
యిడుమల్ లేక లభింపఁగాఁ దొడఁగెఁ దల్లీ! మేము సంతోషమున్
బడయన్ జాలితి మీాదిసంబుననె మా ప్రారబ్ధ మేమో! భయం
పడఁగాఁ గారణ మొక్కఁ డేర్పడెఁ గదమ్మా! మాయరాచిల్కకై.

—: చిలుక యాగడము :—

ఈ నీ పెంచిన రామచిల్క భయ మెంతేలేక యిల్వీడి మా
క్షోనన్ జొచ్చి స్వకీయధేనుగణ మాక్రోశింపఁగా బాంధవ
శ్రేణిన్ గూడి తసంత నేత యయి హింసించెన్ దయాలేశ మెం
తేనిన్ లేని విధాన మంది మదిరాక్షీ! యెంత యన్యాయమో.!

కమ్మనిమేఁత మేసి యుదకమ్ముదరమ్మున నింపి చల్లనౌ
తెమ్మెర కేటివాలకపు తీరము లందలి చెట్లనీడ లం
దిమ్ముగ విశ్రమించి సుఖియించెడి గోగణ మేమిచేసె నీ
ద్రిమ్మరి రామచిల్క; కెదిరింతురె సాధువు, లాత్మవైరులన్.

అడవి చిలుకలఁ గూడి నీ బడుగుశుకము
ఆలమందల కనుగ్రుడ్లు లవియఁ బొడువ
లేఁగలన్ ద్రొక్కివైచెఁ దల్లీ! దురంత
వేదనం బొందు చవి వేఱు విధము గనక.

కీరము నింగి కేగి మఱి క్రిందికి డిగ్గన డిగ్గఁ బాఱి; చీ
త్కారము లుప్పతిల్లఁగ వికారపుఁ గూఁతలచే విలాస చే
ష్టారహితంబుగా బటపటధ్వను లొక్కట రెండు ఱెక్కలన్
సారకు గుంపుతోఁ గలిసి సల్పి దురంత మొనర్చె వాలకున్

కాటమఱేని యావులకు గావలివార లనేకమంది బా
హాటముగాఁ గలా రచట నందఱికిన్ మొనగాఁడు గాఁగ న
క్కాట వసించు మేటి విలుకాఁడయి ఱేనికిఁ బిన్నతండ్రియై
పోటరియై చెలంగుచును 'బ్రోలమరా' జను వృద్ధు డింతయున్.

ఆతఁడు గాంచి నీ చిలుక యాగడ మెల్లఁ గృధాతురుండు డా
నై తఱి వేచి వింట శర మల్లనఁ జొన్పి బిరాన వైవఁ బె
న్నోత్రితలతోడ వచ్చి శుకమున్ బడవైచిన — దాని సోఁకుచే
భీతిలి వచ్చె నయ్యది దివిన్ బఱతెంచుచు గుంపు వీడుచున్.

ఱెక్కలన్ నాటి యుండి చురుక్కుమనెడు
శరముతోడనె నీ చిల్క తఱలి వచ్చె
దాని వెన్నంటె వచ్చితి బాణ మిచ్చి
రమణి! నన్నంపి నీవు బున్నెమునఁ బొమ్ము.

నావిని కలభాషిణి
నీ వచ్చిన కార్య మిదియ నీచుఁడ! పో పో
జీవములు బాపి చిలుకకు
నీ వీ బాణంబు గొనఁగ నిల్చితె కుమతీ!

అని కలభాషిణీమణి నిరాదరయుక్తి వచించి నంత వ్రా
ల్చినతల యెత్తి వ్రేలవయిచెన్ మెడ — లేచుచు వ్రాలు చెట్లొ వే
శ్యను దరిఁ జేరి కీర—మకటా! యనుచున్ భువి గూలె నాఁపె — న
వ్వేనుకనె మంజువాణి దురపిల్లి గుభిల్లనఁ గూలె నెక్కుచున్.

కని విషమస్థితిఁ బసులకాపరి దా నిఁకమీఁద నుండ రా
దని యొకచోట నున్న దన యాప్తుని వాడిశరంబు నంది ది
గ్గున నడివీథిఁ జొచ్చి యనుఁగుఁ జెలులన్ గని సైగచేసి రం
డని పఱువెత్తె నల్లమల కయ్యెడఁ బ్రోలమఱేని జేరఁగన్.

వాఁడటుపోవఁ దేరి కలభాషిణి దిక్కులు సూచి చేటితో
వాఁడెటు వోయె — వాఁ డిటకు వచ్చి స్మరించినవాని బాణ మే
వాడకుఁ బోయె నన్న; నుడువన్ బని యే మిఁక దొంగ యాచుఁ గ్రొ
వ్వాడిశరంబు తోడఁ జనవచ్చుఁ గదా యనె మంజువాణియున్.

—: విరోధ ప్రారంభము :—

అవు నవు నంచు లేచి హృదయవ్యథ మీఱిన కోపతాపముల్
దవిలి భజింప నాటవిక తండము నప్పటికప్పు డప్పుడే
వివరము సెప్పకే యనిచె వేఁటనెపంబునఁ బ్రోలఱేనిపైఁ
దవిలిన వైరభావమునఁ దాల్మి వహింపక గోవధార్థమై.

అమ్మగారియాజ్ఞ యైనదే చాలని
మనుమసిద్ధిఱేనిమాటఁ గొనక
దొంగదారు లందు ధూర్తులై యెఱుకలు
నల్లమలయడవుల కెల్ల జనిరి.

—: ఎఱుకల దురంతములు :—

పైకి వేటాడుచున్న తాత్పర్య మొరుల
కెఱుకపడఁ గొన్ని మృగములఁ దఱిఁగి యవల
గాటమధరాధినేతృ గోగణము వధకుఁ
దవిలిహింసించి రా కిరాతకులు మీఱి,

తండములై చరించు పశుతండము మెల్లన సన్నగిల్లఁ గా
పుండినవారు వోయి యెవరో మన యావుల గుప్తరీతిఁ బొం
చుండి వధించుచుండి రని యొక్కట నేగి వచింపఁ గొందఱిన్
దండనసేయఁ బంచెఁ బెడదారులఁ గాటమఱేఁ డుదగ్రుఁడై.

కాటమఱేని సైన్యము సకాలమునన్ జని కొండదారులం
దోటమి లేక గోగణము నుద్ధతిఁ జంపు గిరాతపాళి నా
ర్భాటము లేక దున్మి చతురత్వమునన్ దమ యాలయంద బా
హాటముఁగాఁగఁదోలికొని యార్చుచుఁ బోవుచు నుండె నంతలో.

దొంగతనాన సేన పెడద్రోవలఁ గాటమఱేని యాజ్ఞకు
ప్పొంగి వధించి భిల్లుర నపూర్వగతిన్ దమ యాలమందతో
డం గరువమ్మునన్ జను వెడంగుల గొల్లలఁ గాంచి దూకెఁగా
సింగములట్లు నమ్మనుమసిద్ధి చమూచయ మొక్కదాటునన్.

వెఱ్ఱిగొల్ల లౌట వేదండములతోడఁ
బోల్చి తమను సింగములుగఁ బోల్చి
కొనుచు మన్మసిద్ధిమనుజేశు సైనిక
భటులు దూకి రెదురుబలముఁ గనక.

ఒక సంవత్సరమున్ గతించినను మీరో పుల్లరిన్ మాకుఁ గా
నుకఁగాఁ బెట్టక దొంగదారులను ధేనువ్రాత మల్లాడఁగా
నొకలై వెంబడిఁ గొంచుఁ బోవుదురె! రం డోయోధులారా! దురం
బిఁక మాకున్ మఱి మీకుఁ దప్పఁ దనుచల్లే నిల్చి రడ్డంబుగన్.

నిలిచిన మన్మసిద్ధిధరణీధవుసేనల ధిక్కరించి వే
దొలఁగు డటంచు బల్లెములతో నలవైరినళమ్ము — మీకు ది
క్కులరినచోటఁ జెప్పికొను డంచు హుటాహుటి బోరు సల్పి గో
వుల నదలించుకొంచు మునుమున్ జనఁగా నెఱగడ్డపాటికిన్.

మనుమసిద్ధి వేశ్య మమతచేఁ బెంచిన
చిలుకవలన నింత చేటు గలిగె
నంచు నుభయు లెఱుఁగ కాప్తమిత్రములయ్యు
శత్రు లైరి విధివశానఁ దుదకు.

ఎదిరిబలం బెఱుంగక సహింపని కోపమునన్ బెనంగుచున్
జెదరిన చిత్తవృత్తి మనుసిద్ధి నృపాలభటుల్ రణావనిన్
దుద కవమాన మంది వగతోఁ బసులన్ బగవారి కిచ్చి నె
మ్మదిఁ బదిలం బొనర్చి త్రుటిమాత్రములోఁ బురిఁ జొచ్చి రొక్కటన్.

చొచ్చి సింహపురికిఁ జోళనృపాలుని
దర్శనం బొనర్చి తత్తరిలుచు
మ్రొక్కి పరిభవమ్ము మొదటినుండి వచించి
కావు మంచు ఱేనికాళ్ల బడిరి.

—: మనుమసిద్ధి మనస్తాపము :—

ఏమీ! కాటమఱేనిసేన మిము నెంతే హింస పాల్సేసి సం
గ్రామం బింత కొనర్చి పుల్లగికినై కావించు కొన్నట్టి మా
మామూలున్ జెడఁగొట్టి గోగణములన్ మళ్ళించి కొంపోయెనే!
స్వామిద్రోహ మొనర్చినట్టి ఖలుఁ డెవ్వాఁ డేని తుంతివ్వఁడే!

నాఁడు గాటమఁపతి నన్ను జూడఁగ వచ్చి
కల్లబొల్లి యేడ్పు లెల్ల యేడ్చి
పుల్ల రిత్తు నంచు బొంకాడి పశువుల
వత్సరమ్ము మేపి వైరి యయ్యె!

కాని మీ్మాతని శౌర్య మెంత గలదో కన్నారగాఁ గాంచి యు
వ్వాని నేఁ దుదముట్టఁ జేసెద నిదే వైరమ్ము నాతోడ మున్
దానే కొన్నమహానుభావుఁడుగదా! దర్పించి నావల్ల లే
వేనేరంబులు; గ్రుడ్డిదేజగము — పోం డీవార్తఁ జాటింపుడీ.

అని కొల్వును జాలించుచు
మనుజేశుఁడు మనుపుసిద్ధి మంత్రులతోడన్
జని నేకాంతపుభవనం
బునకు భయం బొదవ క్రోధమూర్తియె నాఁగన్.

చని హుటాహుటిఁ దక్క-యజ్వను బిరాన
బిల్వ నంపించి సిద్ధిపృథ్వీరమణుఁడు
విన్నకత లెల్ల వినిపించి విశదముగను
బలికె వెండియు నిటు శాత్రవప్రసక్తి.

—: మామ యల్లుండ్ర మంతనము :—

కాటమరాయఁ డొక్కఁ డిటు గంటకుఁడై మనలన్ సతమ్ము బా
హాటముగా వృథాశ్రమల కాహుతిగా నొనరించుచున్నవాఁ
డేటికొ — వాదముల్ జొనిపి యింతకుఁ బుల్లరి యీక దుష్టుఁడై
ఛీటికిమాటికిన్ బనుల్లు సేయనిస్వేఁతలు దా నొనర్చుచున్.

పసులకు మేతకై యతఁడు బాములు సెంది పదారుసార్లు మా
పసులకు మేతగాఁ బసరు బచ్చికబైళు లొసంగి లేని సం
తసమున దాని కయ్యేఁడు మితం బగు పుల్లరి నిత్తు మంచుఁ దా
మొసఁగిన పత్ర మంది మన మొప్పితి మింతకు నాటి దుర్విధిన్.

కనికరమేని లేని యల కాటమరాయున కింత గర్వముం
డిన దని నేటికిన్ దెలిసె నిక్కము దాపఁగనేల నాలమం
దను మరణించె దూడలు వనమ్మున నొక్కటి రెండు దానికై
మన కిడ నున్న పుల్లరిని మానెఁ గదా! యత డెంత ధీరుఁడో!

కానిపనుల్ ఘటించి కొఱగామి యటంచును బేరుమోసి య
మ్మానిసి యెంతకాలము సమంచితుఁడై మను; గొల్లఁడొటఁగా
దే నశియించె బుద్ధి — జగతిన్ బుధు లన్నటు లెంతమంచి గొ
ల్లైనను వేపకాయ విష మంతటి వెఱ్ఱి గలాడగున్ గదా!

చల్లపిన్నమనాయఁ డెల్లవేళల నుండ
వెఱ్ఱిగొల్లని కింక వెలితి గలదె
బ్రహ్మరుద్రయ్యచక్రము ద్రిప్పగలయట్టి
సైన్యాధిపతి యుండ హైన్యమున్నె
గొల్లసుద్దులు బల్కి కొండంతలుగ మెచ్చు
బట్టు లుండఁగ వాని బైసితలుగె
తందానతానంచుఁ దలద్రిప్పు వెల్మ బా
వలు గల్గ నతని కేపరువు మాసె

తప్పద్రాగుచుఁ దూలి తైతక్కలాడు
కొలువుగాండ్రుండ నతనికిఁ గొఱతయున్నె
దున్నయీనిన దన్నచో దూడ గాట
నుంచు మను మంత్రు లుండ లే దొక్కచింత.

యజ్ఞ మొనరించి సోమపానాదివిధుల
సోమయాజివి పే వయి సొంపు దనర
జిరపితివి తెల్గు – భారతసంహితకును
మామవై దళవాయివై మంత్రి వగుచు.

కవితాకన్యక మా కొసంగితివి నిక్కంబద్ది మీ కైతకే
యవనీరాజ్యము కాదు స్వర్గమయు రాజ్యంబేని సామ్యంబె – మే
మవనీపాలురమయ్యు మిమ్ములను మామా! యంచు నల్లుండ్రు మా
ట – వచింపన్ వలసెన్ మహాకవి! యదృష్టంబన్న మాదేకదా!

కవితామాధురి దివ్యవాహినిని మున్కల్ వైచి కాలంబెటో
భువి వెళ్ళింపఁదలంచు మాకు నిటులన్ మూర్ఖాళితో గయ్యమున్
దవిలెన్ మా దురదృష్టతాగరిమ నిందల్ వచ్చెఁ బై పెచ్చు మా
యవివేకంబున దూడ లీల్గెనని మామా! యెట్లు సైరింతువో!

తొలుతన్ మామవు నేతవాపయి నమాత్యుండౌదు వాపిమ్మటన్
గల రాజ్యమ్ము భవద్వచోనిధికిఁ దాకట్టయ్యె మమ్మెట్టులన్
నిలువన్ బెట్టినఁ బెట్టకున్నఁ గవియందే భార మర్పించి యి
య్యిలపై నిల్చితి మింతమాత్రముగ మాయుష్మంబెటుల్ దీర్తువో!

అనినఁ బక్కన నవ్వి తిక్కనకవీశాఢ్యుఁ డిట్లాడె నో
మనుజాధీశ! యివేటిమాటలు నన్నుఁ మంత్రిఁ దగఁ జేసి యో
చనతో శత్రు వధోద్యమం బిటుల స్వేచ్ఛన్ నాపయిఁ మోపగా
మనమం దెంచియకాదె పల్కితివి జామాతా! నిన్నుఁ మెచ్చితిఁ.

తెలుఁగురాజేడ గతిచెడి తెలివిమాలి
రాజ ననుకొన్న కాటమరాయఁడేడ
సిరులఁ దనరారు విక్రమసింహపురికి
బాడువారిన యెఱగడ్డపాడు సమమె!

భండనపండితుండయి ప్రపంచమునఁ నుతిగాంచి శత్రులఁ
జెండుచు నూఁచగోఁతగ నసిఁ రణతిక్కన యుద్ధభూమిలో
రెండవ భార్గవుండయి చరించెడిపట్టుల దేరిచూడ మా
ర్తాండునకేని శక్యమగునా యనఁ గాటమతేనికా నెన్నో!

చండదోర్దండపండితాఖండలుండు
మహితదిక్చక్రగతయశోమండలుండు
బాహుశౌర్య సముద్దీప్త భార్గవుండు
ఖడ్గతిక్కన్న కీడు జగాన లేడు.

హరిహరాధీనమయ్యె రాజ్యమ్ము సర్వ
మఖిలశక్తులు ప్రభువునం దమరియుండ
మన మశక్తుల మనుచు సామాన్య నరుని
మాడ్కి వచియింతు వింక జామాత! వినుము.

కర్తవ్యమ్మెదియో యటంచు సురకాకాశంబువీక్షింపఁగా
గర్తవ్యంబగునే నృపా! హరిహరాకారుండు మద్దేవుఁడే
కర్తవ్యంబు రణోద్యమంబని మదిన్ గల్పించె నాకూహ నీ
కర్తవ్యం బిఁక ఏవొనర్పు మతఁడే కావించుఁ దచ్ఛిద్ధియున్.

జయమో తద్విపరీతమో యనుచు నిచ్చల్ సందియంబందు దు
ర్జయుఁడైనన్ మదకా మహామహుఁ డనుత్సాహాత్ముఁడౌచోఁ బరా
జయమే పొందెడిగాదె — యవ్వి భగవత్సంకల్పమాత్రం బటం
చు యథారీతిఁ దలంచు కార్యపరుఁడే సుమిత్రా జయం బందుటల్.

అట్టివాఁడను నేనౌదునా యటంచు
నిస్పృహన్ జెందు మనుజుండు నిరయ మందు
నాత్మదౌర్బల్యమునఁ గార్య మర్థము సెడు
దైవబల మూఁతలేక సొంతమ్ము జెడును.

సకలమ్మున్ శివకేశవాత్మకమునౌ సర్వేశ్వరాధీనమం
చకలంకాత్ముఁడవై యొనర్పు భవదీయంబైన కర్తవ్య మీ
విఁక సంకల్పబలంబు నూఁతఁగొని తండ్రీ! శౌర్యమున్ జూపుచో
బ్రకటించున్ జయమాపయిన్ హరిహరబ్రహ్మంబు హృష్టాత్ముఁడై.

ఏనిఁక మిన్నకుందునె మహీధవ! నీకు జయమ్మొనర్పఁగా
బూనిక ఖడ్గతిక్కనను బోరికిఁ బొమ్మనిపల్కి సేనలన్
వానికిఁ దోడుగా నడవఁ బంపెదగా నెఱగడ్డపాటి భూ
జాని బలాబలంబుల నిజంబగు శక్తి బయల్పడన్ వెసన్.

తానేమో యెఱగడ్డపాటిప్రభుౕవై తైతక్కలాడంగ నిం
దే నెల్లూరున మన్మసిద్ధినృపుడేనిన్ వానికిన్ గానకగా
నే - నిస్త్రింశముఖాన మిత్తియను కన్నెన్ బంపగాలేడె - పో
నీ - నిర్భాగ్యుడు దాని నందికొని శాంతిన్ బొందుగా కిమ్మహిన్.

విను రణతిక్కనా ద్విఖిలపీఠుల బంపి నిమేషమాత్రలోఁ
జని యిదె కాకతీయనృపసత్తము లేలిన యోరుగంటికిన్
గణపతిదేవరాయులను గాంచి మదీయ కవిత్వతత్త్వముల్
వినిచి ముదమ్మమీరఁ బృథివీపతిమన్నన లంది వచ్చెదన్.

నేనిదె వచ్చునంత కవనీధవ! తక్కన నేనతోడ నీ
వో నగరై కరక్షణ మెటో సవరించుకొనంగదయ్య కా
దేని విపక్షశిక్షణ నిరీక్షణదక్షుఁడవౌటఁ జారులన్
మానక బంపి వార్తలు సమగ్రముగా గ్రహియింపు మోపికన్.

వినివిని మన్మసిద్ధి పృథివీరమణుం డిటులాడె నవ్వుచున్
గణపతిదేవరాయులను గన్గొని తత్సభలోనఁ గావ్యమున్
వినిచి బిరానవత్తు సుకవీ! ముదమయ్యెడు; దక్కనప్రవీ
ణుని వెనువెంటఁబోయెడి దనుర్ధరులౌ మనవార లెవ్వరో.

తెలిపినన్గాని ధైర్యంబు గలుగ దనిన
మొలకనవ్వుల జేని నెమ్మోము గాంచి
నవ్వి వచియించెఁ గవితిక్కన ప్రముఖ్యు;
డమల గంభీర మధురవాక్యముల నిటుల.

అవధారు ఖడ్గతిక్కన్నతో జనువారు
మనవార లెవ్వరో మనవిసేసి
దేవరవారికిఁ దీరని ధైర్యంబుఁ
గలిగింతు వినుఁడు శ్రీకంఠరాజు
పెదవేగి చొక్కయ్య పెదవేగి వరదయ్య
గయికొండ వెంకయ్య గంగరాజు
చెన్నప్పపురి చంద్రశేఖరయ్యయు వెల
కంచి వెంగళపతి కనకరాజు

పట్టకోట చిన్నబసవరాజయ్యయుఁ
కాళహస్తి పాప గంగరాజు
ఆదివన్నె చిట్టి మాది రాజయ్యయు
వెడలువారు తిక్కవీరుఁ గదిసి.

మన మనుకొన్నరీతి నయమార్గమునన్ జరియింపఁ దద్గ్రహం
బునకిదెపోయి దిక్కనను బోరికిఁ దారిచి తోడి వీరులన్
వెనుదవులంగఁ జేసి మన వేగుల వారి నరాతి వృత్తముల్
గనుగొనఁ బంచి మీఁదిగల కార్యము లారసి నేను పోయెదన్.

వానలు పట్టిపోఁబసరుఁ బచ్చిక బైళులు బీళ్లు వార; నే
గానికి మారకే పశుని కాయము కాయము దూలిపోవఁ గా
రాని తనమ్మునన్ గనికరాన నొసంగిన మేఁత పుల్లరిన్.
దానగవేసి పోరునకుఁ దార్కొను జేని మనం బదెట్టిదో.

చచ్చినవి చావ దైవవశమ్ము కలిమి
మిగిలి యున్నట్టి పశువుల మేఁత కైన
పుల్లగి రొయింసగి యున్న నిప్పేరు మనకు
గలిగియుండదు దీనికిఁ గత మదేమొ!

సుంకమిడుదాఁక పశువు లిచ్చోటు వదలి
కదలి పోవంగరాదని కట్టుబాటు
జేసి మనవారి నందుండఁ జేసితి మిఁకఁ
బవరమే లేదు - కలిగ్గ దైవమున కెఱుక.

ఈ మాత్రమ్మున కింత త్రొందరపడఁ హేయమ్ము వాటిల్లు సం
గ్రామం బెక్కడి కేగు; శత్రురణ సంరంభంబు వీక్షింపఁగా
నీమంబున్నది రాయబారమునకేనిఁ 'రాయశృంగావళీ'
నామున్ శిష్యుని భట్టు నంపితిమి తన్మార్గంబు లూహింపఁగన్.

ఆతఁడు వచ్చిన తర్వాత నతని పలుకు
లరసినంతనె యుద్ధమే యైన యుద్ధ
మునకుఁ బోదము లేనిచో మోదమెకద!
సంధియే కల్గునెడ నింక తొత్ర మేల.?

—: కవితిక్కన యోరుగంటి కేగుట :—

అన విని మన్మసిద్ధి బళిరా! కవివైనను మంత్రివైన నా
కనయము దోడు నీడవయి యాత్మసఖుండవు నీవయైతి నీ
వనిన విధమ్మునన్ నయ భయమ్ములఁ గార్యము లెల్లఁ దీరఁగా —
ర్రణమదియెంత సంగరభరంబు దలన్ ధరియింప సోదరుల్.

వింతగఁ బల్కెదేమని కవిప్రవరుండనె నవ్వి యిట్లు — నే
నంతయుఁ జక్కఁజేసి నిరపాయముగా మన భీమనేనితో
నంతయుఁ జెప్పిపోయెద సుమా! యతఁడే పను లెల్లఁ దీర్చునం
చింతకు భీము నిల్పి సుకవీశ్వరుఁడుం జనె నోరుగంటికిన్.

—: భట్టు రాయబారము :—

ఆ వెనుకవచ్చె 'రాయ శృంగావళి' యను
భట్లోకం డచ్చటికి - రాయబారమునకు
నేగి యెఱగడ్డపాటి పృథ్వీశు కడకుఁ
దిరిగి యటనుండి తేని సందేశ మంది.

తిక్కయజ్వ నియుక్తుడై ధీనిధియని
వినుతిగాంచిన చింకిర్ల భీమ నేఁడు
మనుమసిద్ధి మహీధవు ననుమతి నిటు
రాయశృంగావళిన్ గాంచి రహిఁ వచించె.

ఓయి మహానుభావ! వినవో! మఱి నీ వెఱగడ్డపాటికిన్
బోయితి గాదె తద్విషయమున్ వినిపింపక యూరకుంటి వ
య్యో! యిదియేమి ముఖ్యముగ నొక్కటి చెప్పుము కార్యమింతకున్
గాయగ మారెనా? యటులఁగాక ఫలంబుగ మారియుండెనా?

ఫలమని చెప్పనేర్చుటకుఁ బాల్పడ నోచుకొనంగ లేదు; నా
కల విధి ఫాలభాగమున నాజి రచించి పరస్పరమ్మునన్
గులుకుచునుండుమం చనె నోకో యనఁ బంక్తులు మూడు వ్రాసి న
న్నిల కీడ్చె వంపెనయ్యె సచివేంద్ర! పురాకృత మిట్టులుండెఁగా.

ఇవ్విధి రాయభట్టు వచియించిన; భీమనమంత్రి నవ్వి - నిజ
జివ్వలుగూర్చి కుల్కుమని చెప్పిన యవ్విధియే రణమ్మునీ
కెవ్విధిఁదప్ప, దండుమృతియే యని కాటమఱేని ఫాలమం
దివ్వఱకే లిఖించె; మన యేలికతో గత మింకఁ జెప్పుమా.

రాయభట్టు రచించిన రణమటంచు
భావిలోకమ్ము బలికినఁ బలుకుగాక
యని దృఢోక్తి వచించెఁ దా నవనినాథుఁ
డవధరింపంగ నున్న దున్నటుల నిటుల.

అవధరింపుము దేవ! సమాదరమున
నేలిక యొసంగినట్టి తాంబూలమంది
పధికవృత్తిని నెఱగడ్డపాటి కరిగి
తత్పురాధిపు రమ్య సౌధంబుఁ గంటి.

నే నట కేగునప్పటి కనింద్యచరిత్ర! పవిత్రమైన భా
షాను గత ప్రసంగము జయల్పడ నల్వదినాల్గు స్తంభముల్
మానుగ గల్గి రమ్యమగు మందిర మందలి రత్నకంబళిఁ
గీనిధి కాటమప్రభు వనేకులతోఁ గొలువుండె విజ్ఞుఁడై.

నను గన్గొన్న నిమేష మంద ధరణీనాథుండు దాలేచి మ
న్నన నుస్వాగత మిచ్చి యాసన మిడన్ దత్సేవకుల్ మెచ్చి దీ
వన లర్పించి తదాసనస్థితుఁడనై వాల్లభ్య మేపార భా
షణఁ గావించితి క్షేమపూర్వకముగా సాంసారిక ప్రక్రియన్

మాటలమాటపై పశులమందల మాటలు దెచ్చి చొప్పి మీ
రేటికి మన్మసిద్ధిధరణీశున కిచ్చెదు మేత పుల్లరిన్
నేటికిఁగూడ వత్సరమునిండి మఱొక్కటికి రెండు మాసముల్
దాటిన నైన నీయని విధాన మదేమని విన్నవించితిన్.

పుల్లరిమాట యెత్తినదె బుస్సునలేచిన త్రాచుపాముగా
నెల్లరు సంచలింపఁ దమ రేమి నెపమ్మునఁ బుల్లరంచు నా
రెల్ల వినంబడంగ గడియించి యొసంగిన ముల్లెఁ గైకొనన్
బ్రల్లదనంబునన్ బలుక బాల్పడిరో యని తేడు వల్కుచున్.

మాట కిదె పుల్ల రిదుమని మనుమసిద్ధి
యే మొగముతోడ నడుగంగ నిచటి కంపె
నీ మహోఘము నంచు నెమ్మోము జించు
కొనుచుఁ దన మంత్రిఁ గాంచి వాకొనియె నిట్లు.

నట్టెడుమేఁత లేఁబసరుఁ బచ్చికబీళుల మేసి తీయనౌ
చిట్టెడు నీరుద్రావి తమచెట్టుల నీడఁ బరుండి యింత కే
రట్టడిలేక హాయి గదురన్ నెమరుల్ బచరించు గోవులన్
బొట్టను బెట్టికొన్నయది బొత్తిగ చాలక సుంకమేటికో.

మనకుఁ గూర్చిన యీనష్టమునకు మనము
నొసగ వలసిన పుల్లరి రుసుమునకును
నున్నకున్ సున్నగా సరిచూడఁ బడియె
కాదు కూడ దనంగ సంగరము సిరము.

అని వచియించి భట్టు నెటులైనను నింటికిఁ బంపుమంచు నేఁ
గనలి సభన్ దొలంగి చనెఁ గాటమరేఁడు కొమారబంగరం
బనియెడు స్వీయభట్టునకు నంతయుఁ జెప్పి యుగాంతవేళ దె
క్కొను ప్రళయాగ్నిహోత్రుఁ డనుకొఁ జని బంధులగూడి పెల్చునన్

మేరమీరి కొమారబంగార మంత
తేని కనుగుణంబుగఁ బల్కె; నోరి కసివీర
దిట్టి యాతని — యుద్ధమ్ము దిట్టబఱచి
యుటకుఁ జేరితి మన్నింపు డీదియ ఘనత.

మఱచినాఁడను దేవ! నే మఱిలులోనఁ
బద్మనాయని బిలిపించి భండనమున
కగు ప్రయత్నము లొనరించుమని వచించి
మంతనముసేయఁ బిలిచె సామంతనృపుల.

నావిని మన్మసిద్ధి నరనాథుఁ డహో! యెఱుగఁడపాటి వృ
ద్ధీవరుఁ డింతవా డవునె విక్రమసింహపురీశు మీఁది కే
దోఃవిధి నెత్తివచ్చిన బుధుం డనిపించుకొనంగ నెంచెనే
దైవములేడె తిన్నయిలు ద్రవ్వెడు పాపికి నీరుఁబుట్టునే!

కానిమ్మాతని శీర్షమున్ రణమునన్ ఖండించి దోశ్శక్తి దు
ష్టానీకంబునకున్ భయంబొదవ మాంసాహార మాసించు నా
శ్యేనశ్రేణికిఁ దచ్ఛరీర పలలంబే నింతకర్పించి బ్ర
హ్మానందమ్ము వహించువాఁడ యశ మత్యంతమ్ము జేకూరఁగన్.

—: వేగుల విన్నపములు :—

మనుమసిద్ధి మహీశుని మాట నోట
నుండఁగా వచ్చి రోజుచు గుండె లదరఁ
బలికె వేగులవాఁ డిటుల్ బరువులిడుచు
చేతులువడంక మేన ముచ్చెమట లొలయ.

అవధరింపుము! దేవ మహానుభావ!
వైరు లింతకు నెఱగడ్డపాటినుండి
కదలి నెల్లూరుదరిఁ జేరి కారుమూరి
శిబిరములువైచి విడిది చేసిరి బయళ్ళ.

చల్ల సోదరులంట మాచర్లనుండి
వచ్చి రేవూరు దొనకొండ వసతిఁగొన్న
యెతమ ప్రభువంట విఖ్యాతుఁ డతఁడు
చేరెనం చేను జెప్పవచ్చితిని దొరకు.

ఎంతకులేశు గాటమ మహీశుఁడు యుద్ధము సేయఁగోరి తా
నింతకు సైన్యయుక్తుఁడయి యిట్టె బిరాన గుడారముల్ బురిఁ
బొంతల నిల్పి చోరుఁడయి పోరికివచ్చె నటంచు వింటి మీ
గొంతెమ కోర్కెలేల నిదిగో యరుదెంచితి మేము నిత్తఱిఁ.

అనుచు వేగులవాని దానంపి మనుమ
సిద్ధి భీమన్నఁగాంచి ప్రసిద్ధచరిత!
చూచెద వదేలయన్న దేవా! చమూప
తిని దురమ్మున కంపెద ననుచుఁ బలికె.

పలికి విరానలేచి తనవారల కెల్లర యాజ్ఞయిచ్చి యి
క్కలనికి ఖడ్గతిక్కన యొకండు చమూపతిగాఁగఁ బోవుచోఁ
బోలుచు జయమ్ము తేనికస బోరికిఁ దారిచి తిక్కనర్ జమూ
బలమును దోడుజేసి జనపాలునితోఁ జనె మంత్రి లోనికిన్.



# రణతిక్కన

## ద్వితీయ పరిచ్ఛేదము

శ్రీ రమణీయమై విజయసిద్ధికిఁ దావలమై యమూల్యమై
వీరస మర్చితం బయి గభీరనిధిప్రచయ ప్రశాంతమై
భారతరాజ్యలక్ష్మి పరివర్ధిత శిష్టజన ప్రపూర్ణమై
చారులతా సుశోభిత విశాలమనోహర సౌధ మొప్పెడిన్.

అదియొక మేడ; మేడపయి హాయిగ దీరికరాగమై ఖరిన్
బదునయిదేండ్ల యీడుగల బ్రాహ్మణబాలిక భారతమ్ము న
మ్ముదమునఁ గేల నంది తన ముంగల శ్రద్ధగ నాలకించు న
మ్ముదుసలి పుణ్యదంపతులు మోదముఁజెందఁ బఠించెడిన్ దమిన్.

బాలికకుఁ బ్రక్కఁ గూర్చున్న ప్రౌఢయువతి
ముందు గూర్చుని వినుచున్న ముసలి దంప
తులను గన్గొని పలుకఁగాఁ దొడఁగె నదియొ
దీన మనకింకఁ దెలియుఁగాదే సకలము.

బావగారు రచించిన భారతమ్ము
నందు వీరాభిమన్యు శౌర్యమ్ము విందఁ;
మద్ది మామగారికిఁ బ్రియమైనఁ జదువు
మని యశోదకుఁ జెప్పె మత్తయ్య దాని.

అమ్మ ! వచింతుఁ దచ్చరితమా నెడఁ బ్రోలమఁగాను నే - సుభ
ద్రమ్మనుగానె — మామ మఱి యర్జునుఁ; డుత్తరవౌదు వీవుఁ జా
నమ్మవుగావు — నా తనయుఁ డయ్యభిమన్యు కుమారుఁ; డింకఁ గా
దిమ్మహి ఖడ్గతిక్కన — బలే ! రణమామఱి చెప్ప నేటికిన్.

అరయంగా నెఱగడ్డపాటి రణమానమ్మా కురుక్షేత్ర సం
గరమాఁగాదె — ఫలాఫలమ్ములు జగన్నాథైక; వేద్యమ్ము లిం
కర రహస్యం బది యేల భారతమునన్ గన్పట్టు సౌభద్రుఁ డీ
సరికిన్ రాఁడు జయంబునంది — మన యీ సత్పుత్రుఁడున్ వచ్చునే !

అరరే ! యెట్టి నుడుల్ వచించితిని జానమ్మా కుమారుండు సం
గరమున్ జేయ హయాధిరూఢుఁడయి రాఁగా మాయదైవంబు నా
కిరవై పాడునుడుల్ వచింపుమని నన్నే నిల్పె — నానోరు నో
క్క; రవంతన్ మతిలేకపోయె; నిఁక నే గంగన్ దిగన్నేర్తునే !

—: ప్రోలమ్మ తికమక :—

అదుగో నాయనవచ్చె నేటికిఁకఁ జాలమ్మా పురాణమ్ము నా
యదుగుల్ మ్రోవఁగ మ్రొక్కి 'యుద్ధమున కమ్మా! నన్ను బోనీయు' మం
చదుగన్ నేనిని యూఁకొందునె యొకైనన్ బాడునోరుండెనం
ఛుడుగన్ జాలక యేమి వాకొనుదునయ్యో ! దైవమే తీర్చెసిన్,

కాటమఱేఁడు వట్టి కొఱగామియయ్యెనను యుద్ధమున్న స
య్యాటలె! చల్లసోదరులు నైదుగురుం వెనుకాడు మూర్ఖులే
నాటికిఁగారు — తాంత్రి కరణప్రియు — లాపయి బ్రహ్మరుద్రు నా
ర్భాటముఁగూర్చి వాకొనఁ దరంబె! జగద్విభుఁ డేమిసేయునో!

తలఁపే లేదిఁక వీరమాతృపదవీ ధౌరేయఁగా నన్ను ము
ద్దుల కుఱ్ఱండొనరించుఁ గాకనుచు నెంతో సంతసం బందు నా
తలఁపుల్ శూన్యములయ్యె, సాధ్వినగు నాధర్మంబు బాటింపఁ కి
ట్టుల దుర్భాషలు వల్కఁగానగునె — బోటుల్ జ్ఞానశూన్యల్ గదా!

—: సిద్ధయ చతురోక్తి :—

ప్రతిహత మామంగళంబున కగునుగాక
కన్నతండ్రియు విజయమ్ముఁ గాంచుఁగాక
దరియ వచ్చెడి మన చిట్టితండ్రి సాద
రమున దీవించి పంపు మార్భాట ముడిగి.

తండ్రికంటెను నుత్తమురాలు దల్లి యనఁగ
వినమె ప్రసవాది పోషణ విధులచేతఁ
దేమలి త్రికరణశుద్ధి సాధ్వీమతల్లి
తల్లి దీవింప సుతునకుఁ దనరు జయము.

నీవు సాధ్వీమతల్లివై నెగడియున్న
ఫలమునకుఁ ద్రికరణశుద్ధి ఫలముఁ గూడ
దోడుపడియున్న విజయ సంతోషములకు
గొఱఁత లేదింకఁ దనయునకున్ రణోర్వి.

త్రికరణశుద్ధిగాదె జగతిన్ సతమున్ ఫణిరాజు మోయుటల్
త్రికరణశుద్ధి చేఁగద విరించి జగమ్ములు సృష్టిచేయుటల్
త్రికరణశుద్ధి వెన్నుఁడు భరించుట లోకములన్; హరుండునున్
త్రికరణశుద్ధి నాశమొనరించుఁ దదీయ బలం బనల్పమే.

పనిగా బెంగ వహించె దేటికి మనోవాక్కాయ ధర్మంబులన్
దన సంకల్పబలంబుఁ జేర్చి నయ వాత్సల్యంబులింపార నీ
తనయున్ దీవనలన్ దెమల్చి విజయోత్సాహంబు లొక్కమ్మడిన్
దనరన్ బోరికిఁ బంప రాదొకొ సతీత్వం బంగరత్తై చనన్.

మామగారు వచించిన మాడ్కిఁ దనయు
సాదరమ్మున దీవించి సంగరమున
కంపు మత్తయ్య వచ్చె నీయాత్మ సూనుఁ
డంచు వచియించెఁ గోడ లాలించి యెల్ల.

నాయన వచ్చెఁగాదె తగునా యిటు లుండఁగ నాయనమ్మ! మా
నాయన నిన్నుఁ గన్గొని మనంబున నేమని యెంచునో! "కుమా
రా! యిదె రమ్మ" టంచు మనసార సుతున్ దరిఁజేరి గాతకున్
హాయిని గూర్చి యమ్మకును నాకు ముదం బొనరింపఁ జాలవో.

అనినన్ బక్కున నవ్వె నీ సదుపదేశాధారమాత్రాన నిం
కను దీవింపనె యంచు బాల నునుబుగ్గల్ బట్టి యాడించి య
వ్వా — నవోఢన్ దన మున్మరాలిని నటు సంభావించుచుండన్ దటా
లున వచ్చెన్ రణతిక్కన ప్రముఖుఁ డెట్లో గుఱ్ఱమున్ డిగ్గుచున్.

—: తిక్కన మాతృవందన మొనరింప వచ్చుట :—

వచ్చి నమస్కరించి సెలవా జననీ! యెఱగడ్డపాటికేఁ
జొచ్చి రణంబు సల్పి నయశూన్యుని గాటమరాజు ద్రుంచి నం
పచ్చయ సారవంతము భవత్పదయుగ్మముఁ గొల్వ దీవనల్
మచ్చిక నిచ్చి పంపుము కుమారుని నన్నిక నంచు నిల్చినన్.

నిలిచి ప్రియమ్మొలర్పఁగ వినీతిఁ గరాంజలి బట్టి వేడు ము
ద్దుల పసికూన నట్టె కనుదోయిట వెల్లువలొచ్చుఁ బ్రేమ వ
త్సలతల కివ్వి సాక్షులనఁ జారెడు నశ్రులఁ జేవిదల్చి వి
చ్చలవిడి గ్రుచ్చి కౌఁగిలిడి; సమ్మతిఁ దల్లి వచించె నిట్టులన్.

—: త ల్లి దీ వ న :—

అనుకొన్నంత ఘటించెనోయి పసికూనా! యుద్ధముల్ దాపరిం
చెనుగా గాటమరాజునితోడ; నిఁక నాజిన్ శత్రులన్ జెండి నీ
వనుమానింపక భార్గవుండవయి మా కానందమున్ గూర్చి త
ల్లిని వీరున్ గనినట్టి రేణుకగ వేల్పుల్ నన్ను జేసెదో.

ఇఁక నీతండ్రిని జామదగ్ని పితగా నీవెంచి మాయన్న! రే
ణుకగా నన్ దలపోయుమయ్య దిశలందున్ గీర్తి పెంపొంద; తే
నికి మోసంబొనరింప కింతకును దండ్రీ! కార్తవీర్యార్జునిన్
వికలున్ జేసిన భార్గవుండవయి గర్వెన్ శత్రు నిర్జింపుమా.

అనిలో నీకెవఁ డడ్డువచ్చెడిని ఫాలాక్షుండవై యొప్పి కా
రణజన్ముండ వటంచు లోకులనఁ బుత్త్రా! నీవు నీ ఖడ్గతి
క్కన నామంబు జగంబునన్ నిలుప శౌర్యంబున్ దగన్‌జూపి భం
డన పాండిత్యఫలమ్ము కీర్తిధనమున్ దారక్షణమున్ జూపుమా.

తల్లికి దండ్రికిన్ హితముదార్చు సుతుండు సుతుండుగాని దా
నెల్లవిధంబులన్ బితల కెగ్గుదలంచెడువాఁడుఁ బుత్త్రుఁడే
పిల్లలు జల్లలున్ గలిగి పెంపువహించు చెదల్ తమంత దా
మెల్ల నశించిపోవె తుద కెట్టులొ యూరును బేరు లేకలన్.

తాము సృష్టించినట్టి నందనుఁడుఁ దల్లి
దండ్రులకు నెగ్గు సలుపఁగాఁ దలపడునెడ
గొడుకు వాఁడెట్టులౌను దుందుడుకుగాక
తల్లి గొడ్రాలు — విధురుండు దండ్రి దలఁప!

అని చివాలున ఖడ్గతిక్కన్న కటిని
వ్రేలు యొరనుండి పామున్నని వాఁదూసి
తన కరమ్మున గ్రుచ్చి రక్తమ్ముఁ దీసి
విజయతిలకమ్ము గూర్చె నవ్వీరు నుదుట.

ఆవల ఖడ్గమిచ్చి తనయా! యిదె ఖడ్గమునంది స్వీయ దీ
క్షావిధి మాతృదేవత యొసంగిన భీకర ఖడ్గమంచుఁ బ్ర
జ్ఞావిధి శత్రుసేన రణచండికకై బలిగానొసంగి నా
కేవిధి వీరమాతృ పద మీవిడి తల్లి ఋణంతఁ దీర్చెదో!

—: తెక్కున నిశ్వాసపాటు :—

తనజనయిత్రి యివ్విధి ముదంబున దీవనలిచ్చి ఖడ్గ పు
త్రిని గయిసేసి గ్రక్కున నరిన్ దెగటార్చి జయేందిరామణిన్
గొని తన చెంత నిల్పుమనెనోయన నీయ మహాప్రసాదముం
చని గొని ఖడ్గతిక్కున బ్రియమ్మున కన్నుల కద్దియిట్లనున్.

ఎన్నఁడులేని తేజ మదియేమొ శరీరములోని కేగ నే
నిన్నిదినాలనుండి జననీ ! పులినోటఁ బురాణవాక్యముల్
విన్నదిలేదు కన్నదియు లేదు వచింతు విన్గదమ్మ నా
కున్నది మాతృదేవత సముజ్జ్వలతేజ మమోఘరక్షయై.

ఆతేజం బిడె నొక్కొ పుత్రునకు నీ వన్నట్టి యిల్లాలు లో
కాతీత ప్రతిభుండు భార్గవుఁడు గాఁగా నామె ప్రఖ్యాతయై
ఖ్యాతిన్ జెందెను వీరమాతయయి; లోకంబందు బ్రజ్ఞావిధిన్
నీతిశ్లాఘ్య పరాయణత్వమున వానిన్ మించెదన్ నీకృపన్.

రెండవ భార్గవుండన నరిప్రకరంబు వధించి మించి యు
ద్దండతరైకశాసన విధానమునన్ సమరాన నిల్చి బ్ర
హ్మాండము దద్దరిల్లు నటు లార్వఁగఁ బీనుఁగుబెంటఁ జేసి వే
దండ రథాశ్వసైన్య నివహంబుఁ గడింది పరాక్రమించెదన్.

లేపకు దైవ ముండె నని తేకువబోవిడి దేబ్బెరించు నే
వాపరతంత్రుం డట్టు లని వార్యత దైవమునమ్మి గాలిలో
దీపము వెట్టి దైవమ ! పదింబది సీయదిభార ముంచు వి
జ్ఞాపనచేసి వేడికొను నాపనుగానని నమ్మ మమ్మరో !

కదువడిఁ బోవఁగావలయుఁ గాటమతేని వధింప నాజికిన్
దడవిదియేల బంపుము - ముదమ్మున నేఁజని వైరిఁద్రుంచి నీ
యడుగులయాన దిగ్విజయ మంది సరాసరి నెమ్మొగమ్మునీ
యడుగులమోపి తేల్చి ప్రమదాశ్రులఁ; జేసెద వీరమాతగా.

అని పదముల వ్రాలిన తి
క్కన నటు లేవంగ నెత్తి గారవములరన్
జని క్షేమమ్మున - లాభ
మ్మున రమ్మని పంచెఁ దల్లి ముద్దుల తనయున్.

—: తండ్రి దీవన :—

పంచినయంతఁ దండ్రి పదపద్మములన్ బడి వేడు పాపనిన్
సంచిత పుణ్యుఁ దిక్కనను జక్కఁగ బాహువులెట్టి సాచి రో
మాంచములొప్పఁ గన్నుఁగవ నశ్రులు వారఁగ లేవనెత్తి ర
మ్మంచుఁ గదించి కౌఁగిటఁ బ్రియమ్మున సిద్దయవల్కె నిట్టులన్

కారానట్టి పనుల్ ఘటించి యనికిన్ గాల్దువ్వ దుర్మార్గునిన్
ధీరున్ గాటమతేని ద్రుంచి మనయందే ప్రాణముల్ నిల్పి యి
ష్టారామిన్ బడు మన్మసిదికి యశమ్మున్ గూర్చి తేజస్వివై
యేరా నాయన! పేరునిల్పికొని రావే నిన్ను మెచ్చన్ జనుల్.

పోరన్ సుస్థిరబుద్ధి నిల్చి యరులన్ బోకార్చి వెన్నీయకే
పోరన్ జాలెదు వీరుఁ డెందు మృతజీవుం డంచుఁ బేర్మోసి వి
స్తారామోదముఁ జెంద లోకము; ప్రశస్తంబైన సత్కీర్తి నా
తారార్కంబుగ నంద భూమి నమరత్వం బందు గల్పాంతమున్.

అరితోఁ బోరున నిల్వలేక తన ప్రాణాపాయ సందర్భ మం
దరచేఁ బ్రాణమునిల్పి పిక్కబల మొయ్యం జూపు సన్న్యాసి కో
గిరమే పుట్టదు లోకమం దిఁకను గాకేఁ గొట్టిన ట్లెల్లరుం
బరిహాసమ్ము ఘటింత్రు - వాని కవమానం బొప్పు నర్థాంగిచేఁ.

ధరణిం గుపుత్రుఁ డుండు టది తథ్యము; గాని కుమాతయుండు ట
బ్బర మని వత్సలత్వమునఁ బొచ్చెములేక బుధుల్ వచింత్రు; సం
బర మది నాకుఁ గూడ నిటు భండన పాండితి లేక పందయై
పరువిడు పుత్రుఁగాంచి సుతవత్సలతం జనయిత్రి మెచ్చునే.

బలమా పోవును; నింద నెత్తిపయికిం బ్రాకుం; విరోధంబగుం
గులమే రోయును; మానముం జెడును; గోర్కుల్ బొల్లులై పోవు నా
కులపాటొందును — మార్మొగానఁ జెలియుం గోపంబు రెట్టించెడిం;
దలిదండ్రుల్ మననీరు; బంద కిలలోనం నిల్వఁ దావున్నదే!

వీరుని గన్నతల్లి జనవిశ్రుతయై చను వీరమాతయై
భూరియశోభిరామయయి పొల్చు; తదీయసుతుండుఁ దత్కృపన్
వీరుఁడగాక — యాతడు భువిం దిరుగాడెడుచోట్లు ధన్య వి
స్తారము; లాతఁ డాడెడి వచస్సులు మంత్రము లింత యేటికిన్.

నీ వికఁ బోయిరమ్ము జననీజనకుల్ ముదమంద; నేఁడు నీ
చేవకు సంతసిల్లి జయసిద్ధి గ్రహింపఁగ; వీరపత్నియై
నీ విభవంబు మెచ్చి తరుణీమణి సంతసమంద; నిచ్చలుం
నీ విజయమ్ముఁ జూచికొని నే హరి గొల్చుచునుందు నెమ్మదిం.

నీ జయము సర్వతీర్థము
నీ జయమే వారణాసి నీరధ యదియే
నీ జయము సేతువయ్యెడి
నీ జయమే స్వర్గసుఖము నిక్కము వింటే!

తనివి బొందక వృద్ధుఁ డెంతయు ముదమ్ముఁ
జెంది యిటులాడి మఱిమఱి జేరఁదీసి
కౌఁగిలిడి మెచ్చి దీవనల్ గడ కొసంగి
చిట్టి బంగారుతండ్రి నిశ్చింతఁ బంపె!

—: చానమ్మ సంభ్రమము :—

పంపెనో లేదో ప్రియురాలి పజ్జ నేరఁ
బోవ్రులోపల హరిహరుఁ బూజసేసి
తత్ప్రసాదమ్ముఁ గైకొని ధవుని కెదుర
వచ్చెఁ జానమ్మ భాగ్యదేవత విధాన.

వచ్చి నమస్కరించి నిజవల్లభు పాదపరాగ మెత్తి సం
పచ్చయ సారవంత మని ఫాలమునన్ ధరియించి భక్తిమై
పచ్చని పూలమాల భగవద్గళధార్య మటంచుఁ గంఠమం
దచ్చువడంగ వైచి ప్రియమార నిడెన్ బ్రభుసత్ప్రసాదమున్.

ఇది వచియించె నా పలుకిదే వినుఁ డింతట వీరపత్ని మీ
వడఁతి యటంచు లోకములు వాకొనఁజేయుఁ; డిదెంతమాత్ర మీ
గడుసుదనంపు తీవి; కిదిగా బ్రియ మయ్యెడు; నింత కే
నడిగిన దొక్కటే — మఱితుంధా మఱియొక్కటి గోర తేమగా,

తడవయ్యెన్ మఱి పొందు యుద్ధమున కా ధాత్రీతలాధ్యక్షుఁ డీ
యెడకున్ దిక్కున రాడటంచనక మున్నే మన్మసిద్ధిన్ బ్రియం
పడి మీరే యెదురై రణోత్సుకత సంభావించి రాజాజ్ఞ న
య్యెడ కేగుం డెఱగడ్డపాటి ప్రభువల్లే త్రుళ్లి చావన్ భువిన్.

కవితాగోష్ఠికి నోరుగంటి కరుగంగా బావగా రూర తే
రు - విశేషించి నమస్సు వారికెద మీరున్ జేసిపొండింక; మీ
కవుగా దిగ్విజయమ్ము తేని కరిరాజ్యశ్రీ సమర్పించి నా
సవతిన్ జేయుఁడు మీ జయేందిరను శశ్వత్కీర్తికిన్ దోడుగా.

ఇది కడసారి మాట - చనుఁ డింతకు మీ రణతిక్కనాఖ్య కె
య్యెదియును లోటురాదిఁక నిదే ముడివేసికొనుండు పొందు మీ
మదికిఁ బ్రశాంతమౌ నటు సమంచితభక్తి భజింతు సిద్ధికి
య్యెదనున నమ్ము డీ హరిహరాత్మక దేవుని నిష్టదైవమున్.

అని తమ యిష్టదైవమున కారతిఁబట్టి తదీయ కాంతి నా
ధుని ముఖసీమ కాత్మకర తోయజమొయ్యన నెత్తి హత్తి క్ర
న్నన దన వ్రేలికంటికొను నల్లని కాటుకతోడ గోరు వె
చ్చని తిలకంబు నెన్నుదుటఁ జక్కని రక్షగ దిద్ది పంపెఁ దాన్.

—: భారత ప్రసంశ :—

పంపినంతనె కొమరిత పజ్జ నేరి
ఖడ్గతిక్కన్న పలికె బంగారుతల్లి !
చిట్టిపలుకుల భారత మిట్టి చదువ
నేర్చితి వటంచు జుబుక మొంతేఁ గదలి,

తోడనే లేచి తత్పదతోయజముల
కెరగి పల్కె యశోద యిక్కరణిఁ దండ్రి!
భారతీయుల కాదర్శఫణితి నున్న
భారతము ప్రౌఢవాక్య సంభారమితము.

తీరిచి దిద్ది కమ్మపువుఁ దేనియ సోనలలోన నద్ది శృం
గార రసాద్యమూల్య తరగంధ సువాసిత పూతపద్య వి
స్తార తరంగ సంకలిత జాహ్నవిలోపల ముంచి తేల్చి యీ
భారతమున్ రచించెఁ గవి భావుకుఁడా మన తిక్కయజ్వయే.

మా పెదనాన్నగారి రసమంజులభావపరీత భారత
ప్రాపక మంది గాదె మన భారతఖండము రాజకీయ సం
స్థాపన కార్యనిర్వహణ సంగతి భూరిపరాక్రమవంతమై
దీపిత సర్వధర్మగుణ దీధితి సుందరమై చెలంగెడిన్.

భారత మాంధ్రవీరులకు భాగ్యవిధాత - పతివ్రతాళికిన్.
జారని పట్టుగొమ్మ; కవిసంతతి కాయువు బట్టు; ధర్మ వి
స్తార తరంగసంతతికి సాగర; మార్యచరిత్ర పాళికిం
పారెడు కల్ప; కమ్మది యెట్టైనను భారత మార్యసేవ్యమా.

రాజనరేంద్రుఁడా తెలుఁగు రాజు, మహాకవి నన్నపార్యుచే
రాజిలునట్లు; తిక్కకవిరాట్కృత ముత్తరరామ సత్కృతిన్
దేజము నందెఁగాదె జగతిన్ మనుసిద్ధి నృపుండు; గావ్యమున్
రాజసభాంగణంబుల విరాజిలె — నిర్వురు ధన్యులై రిగా!

కుండలముల్ ధరించి మఱి కుంకుమ నెన్నొసటన్ ధరించి మా
ర్తాండ మరీచి దీధితు లుదారత మోమునఁ జెంగలింప బ్ర
హ్మాండము లావటిల్ల నిగమాంతవచోనియమప్రచార ము
ద్దండతరోక్తులన్ బలుకు ధన్యుఁడు తిక్క కవీశ్వరుండె కా!

సారవిచారపూరవిలసన్మధురైక మనోజ్ఞభావ సం
చార పరంపరల్ వదనసారససీమఁ జెలంగ సాంద్ర గం
భీర దృగంచలంబుల సవిస్తరయుక్తి సదుత్తరంబులన్
ధీరత నిచ్చుఁగాదె జగతీపతి రాచరికంపు ఠీవిమై.

నన్నయ, వ్యాసభారతమునన్ గల తొల్లిటి రెండు పర్వముల్
మున్ననువాదమున్ సలిపి మూఁడవదాన సగమ్మమాత్ర మా
తెన్నునఁ దెల్గుతేఁ డనుమతింప రచించి గతింప - శేషమే
మెన్నక తక్కఁగాఁ గలపదేనిటిసిన్ దెలిగించె యజ్వయున్.

రాజనరేంద్రుఁడున్ దెలుఁగు రాజగు; తేఁడును దెల్గుఁజోడడా
రాజకులంబు మెచ్చు నుడురాజకులీనుల దివ్యసత్కథా
రాజముఁ గావ్యవస్తువుగ రంజిలఁ బంచమవేదమై భువిన్
రాజిలు భారతమ్ము గవిరా జనువాదము జేసెఁ బ్రజ్ఞమై.

సోనలా కమ్మపూఁదేనె వానలలోన
దనియు భృంగీనినాదమునఁ బెనసి
కలకంఠకంఠనిక్వాణంపుఁ బంచమ
మధుర గీతికలలో మమతఁ దగితి

సరసంపు సంజె కెంజాయ తళ్కులలోని
రామణీయకమైన రాగ మంది
కమ్మపుష్పాడి దుమారమ్ము పైకెగజిమ్మ
పసదనమ్ములలోని భావ మరసి
రచన మొనరించెఁ బండితరంజకముగ
బ్రకృతి జనయిత్రికిన్ దొలి పట్టియౌచుఁ
బఱగు కవితాకుమారిఁ జేఁబట్టి పైడి
గంటమున భారతమ్ము దిక్కన మనీషి.

సిద్దయ కొమ్మయార్యులు ప్రసిద్ధులు సోదరు; లందు జ్యేష్ఠుఁడౌ
సిద్దయ కాత్మపుత్రుఁడ వజేయుఁడవై మను నీవు తీవితో
నుద్దికివచ్చు వీరుఁడు రణోర్విఁ గలండె మహాత్మ! భారతం
బద్దిర! కొమ్మ యాత్మసుతుఁ డౌ కవితిక్కన దెల్గుసేయఁడే!

తిక్కచోడుని కొమరుఁడై దిక్కుగనక
తండ్రిలేమి మనోవ్యథ దనరు తేని
రాజ్య సింహాసనమున విరాజమానుఁ
జేసి మన తిక్కయజ్వ పూజితుడుగాఁడె!

అక్కన బయ్యనల్ నృపు రణావని నుక్కడగించి తాము జేఁ
జిక్కిన రాజ్యముం గొని విజేతల మంచదలించి పోవఁగా
దిక్కనుధీంద్రుఁ డా గణపతిప్రభు సత్కవితానిరూఢిఁ గై
పెక్కఁగఁజేసి తత్కృప జయేందిర తేనికిఁ గూర్పఁజేయఁడే!

నాపని గాదటంచు నళనాథుని వైరుల కప్పగింప కే
ప్రాపువహించి సత్కవిత రాజ్యరమన్ సమకూర్చి రాజ్యసం
స్థాపక నామమందుటయు చాలక సత్కవితా లతాంగికిన్
ప్రాపయి లోకమొప్పికొన భారత సంహితఁ దెల్గుసేయడే!

పొగడఁగలేదు తండ్రి! నిజమున్ వచియించితి నున్నదున్నటుల్
మగిడి లభించెఁగా మనకు మాసినపో శెలగడ్డపాటి తేఁ
డుగఁ దనువున్ ధరియించి - యిపుడున్ జనె దాసఁగవిప్రముఖ్యుఁ డొం
టిగ నలమోరుగంటి - కవనిన్ గుణశాలిహితున్ దొఱంగునే.

అన విని తండ్రివల్కెఁ బ్రియమార వచించెదు నేర్పుతల్లి నీ
కు నెటుల లభించెనమ్మ వినఁగోరిక వీరికలెత్తెఁ బద్యమున్
వినిచెదె నాకొకండనఁ; బ్రవీణతఁ బొత్తమువిప్పి భక్తిమె
వినిచెఁ గుమారి యిట్టులన వీనమనోహర రాగవైఖరిన్.

* శ్రీయన గౌరినాఁబరఁగు చెల్వకుఁ జిత్తము బల్లవింప భ
ద్రాయిత మూర్తియై హరిహరంబగు రూపముఁదాల్చి విష్ణురూ
పాయ నమశ్శివాయ యని పల్కెడు భక్తజనమ్ము వైదిక
ధ్యాయత కిచ్చు మెచ్చు పరతత్వముఁ గొల్చెద నిష్టసిద్ధికిన్.

రమ్మదె తండ్రి! యీహరిహరంబగు రూపముతోడ నొప్పు దై
వమ్మిదు. నీకునున్ విజయభాగ్యముఁ గైకొనుమీ. ప్రసాదమం
చిమ్ముగఁ బల్కె యప్పుడపుడే భగవత్పరిభక్తమా ప్రసా
దమ్ము నొసంగె బాలిక ముదంబెసఁగన్ దన చిట్టిచేతులన్.

* ఈ పద్యము తిక్కన రచితాంధ్ర మహాభారతములోనిది.

—: ఖడ్గతిక్కన రెండటిసారి యుద్ధమున కేగుట. :—

ఒసఁగిన దాని గైకొని యెటో భుజియించి మహాప్రసాదమం
చసమనయ ప్రవృత్తిఁ దనయున్ రణతిక్కన గారవించి సం
తసమున మేడమెట్లుదిగి తత్పరతన్ దమవారుజూడ రా
జసమునఁ దేజినెక్కి పెలుచన్ బయనించె బిరానభూమికిన్.



శ్రీ మత్పరదేవతాయైనమః

# రణతిక్కన

## తృతీయ పరిచ్ఛేదము

శ్రీమజ్జయలక్ష్మీ రమ
ణీమణి జయమాలంబూని నిలిచెన్ నిరతిన్
సామాన్య నాయికావిధిఁ
బ్రేమన్ బాలేటిదరిఁ బరీక్షాదృష్టిన్ !

-: ఉభయసేనల పటుకుటీరములు :-

వెలమ పద్మనాయఁ డెలమి బావయుగాఁగ
బ్రహ్మరుద్రియ దళవాయిగాఁగఁ
జల్లసోదరులును సామంతులున్ గాఁగ
వెడలినట్టి కాటవీరుఁ డిపుడు.

విడిదిఁగావించెఁ బాలేటికడఁ జెలంగు
పంచలింగాల క్షేత్రమం దంచితముగ
సింహపురినేలు నమ్మనసిద్ధితోడ
రణము గావింపఁ బటుకుటీరములు వైచి.

ఆకుటీరములకుఁ గూర్పునందు మనుమ
సిద్ధియున్ వైచె సొగసైన శిబిరములను
వాన నొకదానఁ బతి తనవారిఁగూడి
కొలువు గావించుచుండె నిశ్చలత మెరయ.

అల్లదె రాజమందిర సభాంగణమోయనఁ గొల్వుకూటముల్
సల్లలిత ప్రభారుచుల సౌఖ్యమొసంగెడు దానిచెంత రా
జిల్లెడు మేల్ హొరంగుల పసిండి హజారము - దానిప్రోలనే
యుల్లసమాడుచుండి రరుగో పహరాయిడు ద్వారపాలకుల్.

ఒకఁడు భీమసింహుఁ డొకఁడు మాధవ
సింహుఁ డనెడువార లిర్వురందునేరి
మనుమసిద్ధి కాటమప్రభులనుగూర్చి
పలుకుచుండిరేమొ ప్రౌఢిమెరయ.

రణతిక్కన్న హయాధిరూఢుఁడయి మార్తాండైక తేజమ్మునన్
దనవారిన్ విడనాడి ఆనిముదలన్ దద్వాహినీ ముఖ్యసా
ధనసంపత్తి గ్రహించి పోరికరిగెన్ దాభారతామ్నాయమున్
దెనుగున్ జేసిన తిక్కయజ్వకృత నాందీవాదమున్ దోడుఁగాక.

మన కవిరాజశేఖరుఁడు మంత్రియునౌ కవితిక్కయజ్వ తి
క్కన నెఱగడ్డపాటికిటు గయ్యముసేయఁగ నంపి తానిఁకన్
గణపతిదేవు పాలికటు గ్రక్కున నొక్కరుఁ డోరుగంటికిన్
జనెమొనమొన్న ఆనిదెస సమ్మతినిన్ గవితాప్రసక్తిమై.

పగర నెదిరించు నెఱగడ్డపాటి గడ్డ
నురవడిఁ బాఱు పాలేటియొడ్డు దఱిని
బంచలింగాల క్షేత్రమై పఱగు నిందు
దవిలెఁబోరు దిక్కనకు శాత్రవులతోడ.

మన కిటనుండఁగావలసె మానితకీర్తి నగాతిసేనతో
రణ మొనరింపఁగా పనికిరాక; ఛికారుల పోల్కిఁజేతిలో
బని కోదవంగలేని యొక బల్లెమునంది 'ఫరాహుపార' టం
చు నిటునటుల్ విరామమెటు చూచిన లేక పచారుచేయుచున్.

ఆయుర్భాగ్యముఁగల్గి యుద్ధమున సాయం చింతనున్ జేసి ప్ర
జ్ఞాయుక్తున్ భువి వెల్లడించు కొనుచున్ సత్కీర్తి నార్జింపవే
కేయంబ్రహ్మలవోలె బల్లెములచే సీఁగల్ దగన్ దోలు చి
ట్లీయార్భాటముతోడి జీవితములిందే తెల్లవారెన్ గదా!

రణతిక్కన్నకు సాయమేర్పఁగ నార్భాటంబునన్ బోరికిన్
జని యున్నట్టి ప్రబుద్ధులెల్లరు మహాసంగ్రామ రంగస్థలిన్
జననం బందినవారె యింతకు నదృష్టంబున్నవారౌటఁగా
రణజన్మల్ బలె సవ్యసాచులనఁ జేరన్ బోయి రింతేగదా!

అని మొనగాళ్ల మాదు మని యయ్యలు బోయిరిగాక కత్తికిన్
మొన యెటులుండునో తెలిసి ముందటి జన్మకునైన సంగరం
బున నడుమున్ బిగింపఁగల పూరుషుఁ డందుల లేఁడొకం డిఁకే
మని యని కేగిరో తెలియదం చని భీముఁడు పల్కె దానిపై.

వినివిని మాధవుం డనియె వీరుడవయ్యు మహానుభావ! నే
రనియటు బల్కెదీ శిబిరరక్షణకై మనముంటి — మాజితోఁ
బని మనకేల — నే నిటకు వచ్చి పదేను దినంబులయ్యె నా
కును దెలియంగఁ జెప్పు వినఁగోరితి నీ రణపాండితిన్ సఖా!

అందలమెక్క సంతసము నందకుండిన దాని నింక మో
యందగువార లెవ్వరు? జయంబన మాటలె యింతయేల మ
ధ్యందిన భానుమాడ్కి సమరావని నిల్చిన తిక్కవీరుఁడున్
ముందుఁడె — యాతఁడేని నవమానము నందకయున్నె సుస్థితిన్.

—: ఖడ్గతిక్కన్న మొదటిసారి యుద్ధము :—

పిన్నమనాయఁడల్లదె పవిన్ బురణించెడి ఖడ్గమంది తి
క్కన్నపయిన్ హుటాహుటిఁ గ్రుధాతురుఁడై జనముల్ వడంక నా
కొన్న మృగేంద్రమో యన నకుంఠితశౌర్యమునన్ బయిన్ బడన్
గన్నులనుండి నిప్పులొలుకన్ బరతెంచె భయంకరార్భటిన్.

అదె కనుమోయి తిక్కనయు నంతకుఁడై వడి లోకభీకర
ప్రదుఁడయి వాలుగైకొని చివాలునఁ బిన్నమనేని పైబడిం
బడి దుముకంగ గుఱ్ఱమును మానక దా నదలించుకొంచు నె
మ్మడి బదిలంబొనర్చుకొని మారొక్కనెగాన నేవబెగ్గిలన్.

తిక్కన బిన్నమనేడులు
నొక్కని కొక్కండు లొంగకుద్ధతిఁ బుడమిన్
గ్రక్కదలించుచుఁ గడిసిరి
దిక్కరు లొండొరును బోరఁదివిరిన మాడ్కిన్.

స్థిరముగ నిల్చినట్టి మన తిక్కనచేతి కటారిజారి మా
యురె! దొఱలెఁ భువిఁగనఁ గదోయి మహాత్మ! యరాతిసేన సం
బరమునఁ బైపయిన్ దుముకఁ బొల్పడ నీతఁడు మిన్నకుండెఁగా
వెఱచిన సేనదిక్కులకు వేఁబఱతెంచె నిదేమి చిత్రమో!

అరరే! నిల్చినసేనపైనఁబడి సంహారమ్ము గావించుచుం
డె రణోర్విన్ బరిపంథి సేనఁ గనుగొంటే భూమిపై జారి యే
తెరవున్ గాననివారలు దిక్కునకు నందీయంగ యత్నించు వాఁ
డరయన్ లేడిక దైవవంచనము సంప్రాప్తించెగా తేనికిన్.

— తిక్కనకు ప్రథమ పరాజయము —

రణమున ఖడ్గతిక్కన బరాజయమంది కటారినెట్టులో
బనివడిఁ గేలఁబూని తనవారిటు సంగరభూమిఁగూలి నం
తనె మదిరోసి శత్రుకృత దారుణముల్ గనులారఁగాంచి భీ
షణధీరుధిర ప్రవంతుల కసహ్యముఁజెంది మఱల్చె గుఱ్ఱమున్.

విరిగి పఱతెంచు తిక్కన వీరు నరసి
చల్లపిన్నమనాయఁ డత్యుల్లసమున
సేనతోఁగూడి చనుచుండె శిబిరములకుఁ
జేరెఁ దిక్కన్న నెల్లూరిసీమకనుచు.

అన్నియుఁ దెల్లవారెగదరా పెదనాయన! చూడుమా దెసన్
విన్నదనంబుదోప బదువేవ్వరు వీరులవీడి ఖడ్గతి
క్కన్న హయాధిరూఢుఁడయి కన్పడుఁగా సిగవీడియాడ నా
కొన్నమొగాన దైన్యమునకున్ నయిదోడవమాన మొప్పగన్.

మొగమదె కందగడ్డయయి మోసులువాఱు నవాంకురమ్ములన్
దెగడుచునున్నవో యనుగతిన్ బురణించు బరాభవాగ్నికిన్
దగిన మహోజ్జ్వలానలవితానశిఖాప్రచయమ్ము మాటికిన్
రగులు కొనంగఁ దిక్కన బరాబరి నెల్లురుఁజేరె ఖిన్నుఁడై!

అదె కనుగొంటివే ప్రియసఖీ! మనతిక్కన బాఱిపోవ వె
న్కదెస జయాంక సంకలిత నవ్యమనోజ్ఞ పతాకమెత్తి కొం
చొదవిన సేనతోడ విజయోద్ధతి నాయెఱగడ్డపాటి జే
ని దళపతి ప్రబుద్ధుఁడు చనెన్ దనదౌ శిబిరంబువంకకున్.

—: విరిగిన తిక్కన నెల్లూరునకుఁ జేరుట :—

కనుగొంటె మనఖడ్గతిక్కన యెటో కారాని మార్గంబునన్
దనయిల్ సేరెబిరానఁబోద మిఁక వాదాల్ మాని ద్వారమ్ము గ్ర
క్కున బంధించి గడెల్ బిగించి మన చిక్కుల్ జేరికిన్ జెప్పి సే
నను సాహాయ్యముగా గ్రహించ మరి సేనన్ జట్టిముట్టన్ వెసన్.

అని శిబిరరక్షణార్థము
సనఁగాదా వారికులును; సంతసమొదవన్
వెనువెంటనె యరి సేనయు
మునుకొని జయజయ నినాదములుఁ గావించెన్.



శ్రీ మత్పరదేవతాయైనమః

# రణతిక్కన

## చతుర్థ పరిచ్ఛేదము

—: తిక్కన్న దీనుఁడై యిలుసేరుట :—

శ్రీలఁదనరారు విజయలక్ష్మీ నివాస
యోగ్యమనఁదగు సౌధతలోపరి నొక
బాలికామణి పుస్తకపాణియగుచుఁ
జదువుకొనుచుండె నా సరస్వతి యనంగ.

ఈభవనరాజ సౌందర్యమే వచించె
ఖడ్గతిక్కన్న గృహమని కావ్యపఠన
మును బొనర్చెడి బాలికామణి తదీయ
కన్యయనుచును బెక్కేల కారణములు

ఈవిధిఁ బొత్తముఁ జదువు చింతనుఁ జూపు మరల్చునంతలో
జావునకుఁ దలంగి విధిచాలక దుర్యశమంది దొంగయై
యేవిధినో గృహమ్ముదరికేఁ జనుదెంచెడు తండ్రిఁ దిక్కనన్
దా వెఱఁగంది కాంచి ప్రియనందని దల్లికిఁ దెల్పె నిట్టులన్.

నాయనవచ్చెఁ బర్విడి రణస్థలినుండి హయాధిరూఢుఁడై
మాయనికీర్తి కిత్తఱిని మచ్చఘటించి పరాభవమ్మునన్
గాయపుదూల శాత్రవనికాయములన్ వధియింపలేక యి
ట్లీ యసమర్థతాగరిమ నింటికిఁజేరె విషాదవేదనన్.

వచ్చి కొలుగసాలఁ గూర్చుండె వంచినతల
నెత్తికొనలేక యేమేమొ హృదయమునను
గొణిగికొని పండ్లు పటపటగొఱికికొనుచు
బిగిసికొనుచుండెఁ జేతులు విసిగికొనుచు.

దయ్యము సోకిన ట్లెగిరి దంతని పీడన మాచరించుచున్
గయ్యనఁజేసి యుద్ధతివికాలిక నవ్వుచు బోటుమాటలన్
డయ్యగఁజేసి వైరుల నడంచినయట్టుల మోదమందుచున్
నెయ్యరఁ జీరుచున్నటుల నిన్ బెనుకేకలు వేయు చింతనన్.

కలలో మెలకువ మఱి
మెలఁకువలోఁ గలయుఁ గలయు మెలఁకువలోకటన్
గలిగి మనోవ్యథచే వ్యా
కులతన్ గూర్చుండె నెదియొ గొణుగుచు మదిలోన్.

కోమరిత చెప్పినట్టి పలుకుల్ విని నాయనగారు వచ్చిరే
సమరముపీడి — యియ్యది నిజంబె — విన్ గనలే దిదేటి మా
ట — మనకు మాలదైవము హుటాహుటిఁ జేటుదలంచె నింత
చెమిత విషాదకోప సముదంచిత చానము లేచి దిగ్గునన్.

నీవిఁక గోటవై పునకు నేర్పునఁబోయి జనంబు లేమిగా
భావనజేసి తండ్రిపయి వాదవివాదము లింతలంత లే
దోవిధిఁ బెంచి యాడికొను దోసపుఁబల్కుల నాలకించి నీ
దోవను నీవు రమ్ముచటుఁ దొందరలున్ గలిగింపకేవియున్.

మనకిది చెడ్డకాల మవమానముఁగూర్చు విరించి పోరిలో
మనవలనన్ బ్రభూత్తముఁడు మానమువాయుటగాక రాజ్యమున్
దన పరిపంథికిచ్చి పెడదారుల సౌధము వీడిపోవఁగా
మన కనులారఁగా మనము మానకచూచుట తప్పదాయెఁగా.

చానమ్మ కొమరిత నెఱ
జాణగ నిటుచేసి రాజసౌధముకడకున్
బూనిక బొమ్మని బంపుచు
స్నానపుగదికేగఁ బతికి జలమిడఁ దొగన్.

ఏగి చిరాన నుష్ణజల మించుక శీతలవారిఁబోళముల్
గాఁగ నమర్చి చాటునకుగా నొకమంచము నిల్పి నీకు "దు
ర్యోగ మిటుండెనా" బసుపుటుండయు నూనెయు నున్నిపిండియున్
మాగిన కమ్మపుప్పొడి దుమారము జేరువనుంచెఁ బీటకున్.

అవల మొగసాలకేగి తానాత్మవిభుని
గని చిరాకునఁ బలికె మొగంబు గడిగి
కొంటిరో లేదొ ఆకొనియుంటి రింక
స్నానమొనరింప రండు విశ్రాంతిమీర,

—: చానమ్మ పోటుమాటలు :—

ఎంత శ్రమపడివచ్చితో యింటిమీఁది
కలవరముచేత సమరమ్ము గంగఁగలిపి
ప్రాణములమీఁది తీపి యిప్పనికి మిమ్ము
దొందరించెనని జనులందురు — బిడియమొ.

బిడియమదియేల మీవంటి వీరులకును
భీరువులకుండు — జగమిద్ది బీరమంచు
బోల్చుకొనదని శంకగాబోలు మీకు
బోల్చుకొననున్న మిమ్మెమ్మనఁ బోల్చిచూచి.

ఒక యోషామణి యిట్టులాడునొకొ దుర్యోగంబు వాటిల్లినఁ సకివాటఁ మరణింపకుంటివని పెల్చఁ ఖడ్గముఁదీసి నోరి కసిఁదీరఁగ దూరి వాలు నోరదూర్చెఁ ఖడ్గతిక్కన్న జంకక జానమ్మయును నాడుసింగమనఁ గిన్కఁ బల్కె లంఘించుచుఁ.

అవునవు లెండు వాలు గలదంచు హుటాహుటిదూసి భార్యపై బవరము సేయవచ్చితిరె బాపురె! మీమొఱగడ్డపాటి భూధవుఁ డెదిరించుపట్లనిది దాగెనె మీయొఱలోన — గాక నన్నువిడగనెంచ కయ్యారిగ నూహయొనర్చి వధింపవచ్చిరో.

చాలు ప్రతాపమింక నెకసక్కెము లా సకితోడ — వాలుతో జాలిక — గట్టిపెట్టుఁడిదె చాల శ్రమంపడినారు మీర లీ జాలము లేల జేసెదరు స్నానముచేసి భుజించి యింతతో జాలని ఫోరికిఁ జనకసమ్మతిఁ దీరిక నింట నిల్వరే!

మన కిఁక లేనిపోని యవమానము లుండవు తొంటి కీర్తియున్
వెనుకకుఁబోవు — యుద్ధమున వీరులతోఁ బనిదీరు — మిత్రులున్
మనదఱి కింక రారు కులమాన్యులు బెద్దలు జేరనీయ; రే
ఘనతయు లేక కాలిపయిఁ గాలిడి హాయిగఁ గూరుచుండమే.

అది యెటులేని బోవుఁ గడుపారఁగ నింత భుజించి నిద్రచే
మదికొక శాంతిఁ గూర్చికొను మార్గము జెప్పెద ముందు స్నానపున్
గదికిఁక రండు బోడ మటగాదె సుగంధ జలాభిషేకముల్
బాదవెడి మీకు — నవ్వెనుక భోజన; మాపయి నిద్రపోవుటల్.

అని పతికేలఁ గేలు బ్రియమారఁగ దించి విలాసవైఖరిన్
తను జలకమ్ములాడు దెసఁ దత్పరతన్ విభు నిల్పి స్నానమున్
బొనరిచి వేగ రండనుచుఁ బోడిమినాడిన యింతిఁ జూచి నీ
పని యిటులుండెనే యనుచుఁ బక్కున నవ్వి వచించెఁ జెల్వుఁడున్.

—: చానమ్మ భర్త నవమానించుట :—

ఔలే! లేజవరాల! మంచ మది యేలా — దీనికిన్ దోడు వా
దాలా నూనెయుఁ బిండియున్ బసుపుముద్దల్ బీటకున్ జెంత నీ
వీ లీలన్ గయినేసి జాణవయినావే పోవె యిచ్చోట నా
కేలా స్నానము జేయనాఁ బడఁతినా యేమీ విభుం డల్పుడే!

చనువిచ్చుచో నాలి జంక కెక్కునటంచు
బుధులాడు నుడులకు బొల్లులున్నె
ప్రియురాలి పేరన ప్రియ మొనర్చెడి ప్రియు
రాలు గాదది వట్టిరాలుగాయ

గండకత్తెరయగాచు గడిమించు నిల్లాలు
ఆలు గాదది యెత్తు తేలుగాని
తెలియనిరీతి వర్తించి వల్లభునొంచు
నాతి గాదది నంగనాచిగాని
అకట! తడిగుడ్డతోడ గుత్తుకలుగోయు
కలికి గాదది ఖాణంపు ములికిగాని
తళుకు బెళుకులుజూపి రక్తంబుచీల్చు
తరుణి గాదది నట్టేటి తరణిగాని.

తోడునీడవౌచుఁ దొంగలిఱెప్పల
దాచి నన్ను ప్రాణధనమువోలెఁ
బైటబెట్టితివుడు బ్రాణనాథుని బైసి
నమ్మబెట్లు నిన్ను నాతిమిన్న!

అవుగా మీకిటులాడనౌనె మఱి మీకర్ధాంగిఁ గానంటినా
చెవులారన్ భవదీయ కీర్తిని జేజేల్ గొట్ట లేనంటినా
కవయిత్రిన్ భువిఁ గాకపోయిన నుతుల్ గావింప లేనంటినా
ధవుఁడీజన్మకు నెట్టివాఁడయిననౌ దైవమ్ము గాడంటినా!

లావుదొఱంగి మెల్లఁగఁ బలాయన మంత్రముతోడ నింటి కే
దోవిధిఁజేరి యుంటఁ జెలితోఁ దులదూగిత రంతెకాని మ
జ్జీవిత నాయకత్వమున జేసిగదా మగవారలైతి రీ
భావనలేల నిక్కమిదె వాక్కొనెదన్ దుదకాడువారలే!

కడుపారఁ గనినట్టి మీ జననియుఁ గాంతాశిరోరత్న మె
ప్పుడు మీపాదము లాశ్రయించు చెలి మీ పుణ్యాంపుటర్థాంగియే
కడకుఁ గూఁతురు గన్యయయ్యు నదియుఁ గన్పట్టదిచ్చోటని
ప్పుడు మీంతో ముగురాడువారముగదా! పొండింక స్నానార్థమై.

* పగరకు వెన్నిచ్చినచో
నగరే నిను మగతనంపు నాయకులెందుఁ
ముగురాడువారమైతిమి
వగపేటికి స్నానమాడ వచ్చినచోటన్.

అని చానమ్మ తటాలునన్ మెఱపుఁదీవై మాయమైపోవఁ; ది
క్కాన నిశ్చేష్టత రిత్తచూపుల దెసల్ గన్గొంచు వేమాఱు వె
చ్చని నిట్టూర్పు నిగిడ్చి యింతిపలుకుల్ సత్యంబులంచెంచి మ
జ్జనమెట్లో యొనరించి దొంగగతి లజ్జన్ మోపెఁ గాలింటిలోన్.

—: భుజింపవచ్చిన తిక్కన్నను తల్లి యవమానించుట :—

మడుగుఁ దోవతిఁ బీటపై నిడెడు నీమంబెల్లఁ బోనాడి యి
ప్పుడు చీరన్ దనకిచ్చు చేడియను నిప్పుల్ గ్రక్కు చూపుల్ బయ
ల్పడ వీక్షించుచుఁ బీటపై పరిభవప్రాప్తైక దుఃఖమ్మునన్
దడివస్త్రంబుల తోడఁ జేరఁబడె నాతం డెట్టులో దిగ్గనన్.

చేరినయంత నింతి పతి చెంత హుటాహుటి వెండిపళ్లెరం
బోరిమినుంచి యత్తకు మృగాక్షి సుతుండు భుజింపవచ్చెనం
చారసి విన్నవింప నవు సౌ రణతిక్కనకుఁ రణోర్వి దు
ర్వార పరాక్రమమ్ము గన రాదని ప్రోలమ యుంచె నన్నముఁ.

* ఈపద్యము మాత్రముఁ జాటుపద్య మణిమంజరిలోనిది (24వ పేజి).

"విరిగి యిలుదూరి చోరుని విధిఁ జరించు
పంద కిలలోన జలమేని ప్రాప్త మౌనె!"
అనుచుఁ బారమ్మ జదువు విద్యార్థి తోడఁ
దండ్రి- పంక్తికి రాడని తనయుఁ డెఱిఁగి.

అంతకుమున్నె సందె హృదయవ్యథ నెట్టటొ వార్చివార్చి ని
శ్చింత దొఱంగియుంటఁ బరిషేచనమున్ బొనరించి వాడుకన్
బంతముతోడ నోగిరముఁ బండ్లబిగింపున ముట్టి కొంతలోఁ
గొంత నెటో భుజించి తుదకున్ మన తిక్కన పాలు దెమ్మనెన్.

దెమ్మనినంతఁ దల్లి కసి దీరఁగ రోషపరాభవైక ఖే
దమ్ములతోడ నొప్పి తను దా లవణమ్మొక కొంత చేర్చి క్షీ
రమ్ముఁ గలంచి భోజనపరాక్రమమేని లభించి నందు కే
నమ్మనుగాన మెచ్చితిని రా కొడుకా! యని పోసె క్షీరముల్.

పోసిన క్షీరముల్ విఱిగి పోయి వికావికలౌచు నీటిపా
లై సరితప్పి సార మరుదై తెఱగల్ గర మంతుమాత్ర మ
ట్లే సెలఁగన్ జివాలుమని లేచి కటూక్తి నివేటిపాలు త
ల్లీ! పసిలేదు భోజన మిసీ యని పల్కె సరోషచిత్తుఁడై.

నిలిచిన కొమరుని గని| పలికెన్ బ్రోలమ్మ యిటులఁ బ్రక్కనఁ గోడల్
నిలువఁబడి వెఱ్ఱిచూపులఁ | దిలకించుచు నుండఁ గోపదీప్త నయనయై.
* అసదృశముగ నరివీరుల | మసిపుచ్చక విఱిగివచ్చు మగపంద క్రియన్
గసవున్ మేయఁగఁబోయిన|పసులున్ విఱిగినవి తిక్క! పాలున్ విఱిఁగెన్.

---

* ఈ పద్యముగూడఁ జాటుపద్య మణిమంజరి లోనిది.

వంచిన శిరమెత్తి — తనను
వంచించిన తల్లివంక భామినివంకన్
వంచితుఁడయి గని తల పం
కించుచు నిట్టూర్పువిడిచి కినుకన్ జనియెన్.

కాలుసేతులు శుద్ధోదకములఁ గడిగి
కొంచుఁ దిక్కన్న మొగసాలకున్ బిరాన
వచ్చులోపలఁ గూఁతురువచ్చి — తల్లి
తో వగర్చుచుఁ బలుకఁగాఁదొడఁగె నిట్లు.

—: నెల్లూరి పౌరులు దిక్కన్నను దూరుట :—

అమ్మ వచింప నేమి కలదమ్మ పరాజయమంది తండ్రి ఖే
దమ్మున నిల్లుసొచ్చిన విధానము బిన్నమనేడు గాంచి మో
దమ్మున దుర్గరక్షకులఁ దన్ని తదీయ కవాటబంధ మో
క్షమ్మొనరింపనెంచు తమకమ్మున నుండె నటంచు వింటిగా.

ఇంతియగాక విక్రమపురీశుఁడు దిక్కన దండనాథుఁగా
నింతకుఁజేసి పంపుటదియే యొకవెఱ్ఱితనమ్ము — జేసెఁబో
నెంతయుఁ బ్రేమతోడ నదియే తనపాలిటి స్వర్గమంచు నీ
రంతులమారి తిక్కఁడు పరాక్రమియై చని పారివచ్చెఁగా.

రణమొనరించువాఁడనని రాజును మోసమొనర్చి గుఱ్ఱ మె
క్కిన నెఱజాణయాటఁ గన కేల విలాసపు వాలుఁబూని తి
క్కన రణభూమిలోనఁ దిరుగాడినమాత్రన వీరుఁడౌనె వై
రిని కర మగ్గిపాలు నొనరించు మహాత్ముఁడుగాక యిమ్మహిన్.

బవరము సేయకే విఱిగివచ్చిన తిక్కన యిల్లుదూరె మా
నవపతి వీని నమ్మకమునన్ గద పోరికినిల్చె వెఱ్ఱియై
చివఱకుఁ బెన్నలోనఁ జెయిచేతలఁ దాఁ దిగి జేసిదింపెఁ — బో
రువిషయమెట్లు బ్రాహ్మణులెఱుంగుదు రియ్యది భోజనంబొకో.

అనుచు నెల్లూరి జనులాడునట్టి పలుకు
లను కుమారిక సెప్పిన విని బిరాన
వైరిఁ దలపోసి తిక్కన్న పలికె నిటుల
రుద్రుఁడో యనఁ గ్రోధనిర్నిద్రుఁ డగుచు.

ఆయేమీ! యెఱగడ్డపాటి నృపసైన్యాధ్యక్షుఁ డీరీతిఁగా
మాయన్ జాలని మచ్చ నాకిడుట యేమాత్రమ్ముగాకిప్పురిన్
బాయన్ జాలక పోరుచుండుటకు వప్రద్వారభగ్నైకచిం
తాయత్నంబని నేటికిన్ దెలిసెఁ గాంతా! ఖడ్గ మందీయుమా.

తోడనెపోయి సైన్యపతితో నెదిరించి తదీయువాంఛ నేఁ
బాడొనరించి వాని గరవాలమునన్ దెగటార్చివైచి నీ
తోడుగవత్తు నిత్తఱిని తోయజనేత్ర! రణోర్వికంపఁ గ్రొ
వ్వాడి మెఱుంగు ఖడ్గము శుభస్థితి నీవిదె తెమ్ము దిగ్గునన్.

—: తిక్కన్న తనతప్పిద మొప్పికొనుట :—

ఉత్సవమే యదృశ్యమయి యుద్ధమునందు జిరాకుఁ దోఁచె భీ
భత్సముగాఁగఁ జచ్చిన శవంబులనుండి స్రవించు రక్తపా
నోత్సుకతన్ సృగాలచయ మొక్కటఁ జేరి గలంప మాంసప
ర్యుత్సుకతన్ విహంగములు నొక్కట గండలు జీల్చి మెక్కఁగన్.

ఎన్నఁడులేని నిస్పృహత యిట్టి గలంచి మదీయ చిత్తమం
దున్న స్థిరత్వధీరతల కొద్దికలేనివిధానఁ జేసి బ
య్యన్నగ నన్ను మార్చి సమరావని వీడఁగటుల్ బొనర్చి నా
కున్న యశమ్ము మాపి విజయోద్యమ మింతకు మంటఁగల్పెగా.

దూరపుదృష్టిలేని నను దౌర్బలశక్తి విహీనుజేసి నా
పేరును మాపి యింటికిటు వేఁజనుమంచును బంపినట్టి దు
ర్వార మనోవికార కృతవంచనకేఁ దలయొగ్గి పందనై
పోరటు మంటఁగల్పి హాయమున్ మరలించితి నింటివంకకున్.

పొంగుచు వచ్చివచ్చి మన ముంగిటఁ గాలిడునంతలోనఁ గ
న్నుంగవ విచ్చఁ దొల్లిటి మనోవికలత్వము మాని చింతతో
దొంగవిధాన వచ్చి యిలుదూరితి నందితిఁ దత్ఫలమ్ము నా
పొంగడఁగన్ గ్రహించితినిబో విధినేత యటంచుఁ బిమ్మటన్.

వినుమిదె పోరికిన్ జని ప్రవీణత శత్రులఁజీల్చి చెండి నీ
గును జనయిత్రికిన్ ముదముగూర్చెదఁ దీర్చెద మీయభీష్టముల్
మనమున శంకదక్క గుణమాన్య! ననున్ సమరానికంపు మిం
కను దడవేల — భంగమును గల్గునె నా రణతిక్కనాఖ్యకున్.

—: చానమ్మ నయబోధ :—

ఇదిగో నాకుఁ బ్రియమ్ము నాథవుఁడు దన్వీ! వీరపత్నీమణీ!
యిదె రమ్మంచు వచించినన్ బిలుచుఁగాదే యింక నాభాగ్యముల్
దుదకీవ్యాజమునన్ ఫలించెనని సంతోషించె జానమ్మ చ
క్కదనాల్ జిందెడు మోముదమ్మి నొక సింగారంపు రేకొత్తఁగన్.

శాంతరసప్రధానమగు జన్మము బ్రాహ్మణజాతి కార్యమై
యెంతయుఁ బొల్చుఁగాక పనియేమి మనోహర ! దానితోడ న
త్యంత పరాక్రమైకవిభవాంచితశీలికి — భార్గవుండిలన్
శాంతరసప్రధానమగు జాతికిఁ జెందియు శాంతమూనెనే.

క్షాత్రము దైవదత్తమయి శాంతరసమ్మున కీడుగాఁగ లో
కత్రయ మావటిల్ల రిపుకాండములన్ విదళించి మించి యీ
ధాత్రిఁ బరాక్రమింపడె క్రుధామతి నిర్వదియొక్కమాఱుగా
క్షత్రకులాంతకుండని యశమ్ముఁ గడించిన భార్గవుండొగిన్.

ఏకడనేని దేజమున నెంతయునొప్పెడు జ్వాలమాలికా
భీకరమైన కాష్ఠమును బెంపడఁగింప నధోముఖమ్ముగా
లోకువజేసి వంచినను లొంగునె పైపయికిన్ గరాళమా
లాకమనీయమై తళతళచ్ఛవిదీప్తి వహించుఁగా కిలన్.

కొండకోననుండి దుమికి చెంగున మదేభ
కుంభమాన్ జీల్చు సింగంపుగొదమరీతి
గూల్చి పరిపంథి —— జయముగైకొను డికేని
బ్రాయమే లేదు తేజఃప్రభావములికి.

—: తిక్కన భార్యను ప్రశంసించుట :—

వీరులువోవుదారి నడిపించితి వెంతటి జాణవైతివో
హో రమణీమణీ ! మదికెదో మితిలేని ప్రమోదమయ్యె నేఁ
బోరికిఁబోయి శత్రుచయమున్ విదలించి పరాక్రమింతు నా
కోరిమిఁ జంద్రహాసమిడి యోధునిగాఁ గయిసేసి పంపుమా.

అని తిక్కన తన కాంతా
మణి నిటు బంపించి, తల్లి మఱుగున కవుడే
చని బాలుఁడౌచు నేఁ జే
సిన తప్పు క్షమింపు మంచుఁ జేసెఁ బ్రణుతిన్.

ఢిల్లికిఁ బాదుపాయయి కడింది మగంటిమి రాజ్యమేలినన్
దల్లికి బిడ్డడే యను విధానముఁదోప నమస్కరింపఁగా
దల్లి కొమారునిన్ గడు ముదమ్మున లేవఁగనెత్తి తండ్రి! నీ
తల్లిని దేశమాతను యథాస్థితి రక్షణ సేయు మింతకున్.

కొట్టరువువారి వంశానఁ బుట్టి; కుండ
లీంద్రుని పెత్తండ్రి కొమరుఁ డనఁగఁ
దగి; హయంబెక్కి ఖడ్గమ్ముఁ దాల్చి కేలఁ;
గదనమున కేగు ఖడ్గతిక్కన్న కెనరె!

—: తిక్కన్న తల్లికడ సెలవంది రెండవమారు యుద్ధమున కేగుట :—

ఇది నా దీవనసుమ్ము; పొమ్మదియె నీ యిల్లాలు నీ కిచ్చు సం
పద ఖడ్గమ్మనుకొమ్ము— రెంటను నొకేమాఱున్ బ్రసాదమ్ముగా
మదిభావించి గ్రహించి తల్లియడుమల్ మాయించి సత్కీర్తి సం
పద రాజిల్లిన వైనతేయుగతి శశ్వత్కీర్తి వర్ధిల్లుమా.

అమ్మ సెలవిచ్చినట్లు దిక్కన్న రెండు
నొక్కమాఱు గ్రహించి తా నుక్కు మిగిలి
వాలు నొర నుండి తీసి చివాలున నిటు
బలికె మేఘైక గంభీరభాషణముల.

—: తిక్కన ప్రతిజ్ఞ :—

వచ్చినవత్తు శత్రుదళభంజనముఁ బొనరించి— లేక నేఁ
జచ్చినఁజత్తు — రెంటికిని సమ్మతి — నాకేది యెట్టులున్న మీ
ముచ్చట దీర్పకే జలము ముట్టను శత్రువధైక దీక్షచే
సచ్చరితుండ నౌదు నిఁక స్వర్గసుఖంబది యెంతమాత్రమో.!

చచ్చినఁ జావకున్న మీముచ్చటలకు
భంగముండదు — తిక్కన్న బవరమందుఁ
జచ్చి "వీరమాతృ" పదము జననికి మఱి
సతికి "వీరపత్ని"పద మొసంగఁ గలఁడు.

అని ప్రియమార ముద్దుతనయుఁ రణతిక్కనఁ గౌఁగిలించి దీ
వనలిడి - తల్లికిఁ నతి శుభస్థితిఁ జేసి పడంతి మెచ్చి నా
యనకు సభక్తిఁ మ్రొక్కి నయమారఁగ దీవనలంది పోరికిఁ
దన హాయ మెక్కి యేగెఁ బ్రమదమ్మునఁ బెండ్లికొమారు తీవిమై.



శ్రీ మత్పరదేవతాయైనమః

# రణతిక్కన

## పంచమ పరిచ్ఛేదము

—: కాటమఱేని సేన యోడిపోవుట :—

శ్రీ విజయలక్ష్మి సమర
శ్రీవిజయుని బొందఁగోరి శృంగారవిలా
సావిర్భూత దశాన్విత
యై వరియింపంగనుండె నతఁ డెవ్వాఁడో!

విఱిగి నెల్లూరికేగిన వీరుఁడగునొ
మనుమసిద్ధియొ కాటమ మనుజవిభుఁడొ!
వెలమబావయొ! పిన్నమవీరుడగునొ
బ్రహ్మరుద్రయ్యయగునొ నిర్ణయ మదెట్లు?

ఇంత వచింపనేల విజయేందిరయే వరియింపఁగోరి ని
శ్చింతగ యుద్ధభూమి నిలిచెన్‌గద! తిక్కన బారిపోవఁగా
జింతితుఁడౌచు నమ్మనుమసిద్ధియె కాటమఱేనితోడఁ దా
నింతకు సేనతోడ బిరుదీయక పోరొనరించుచుండెగా.

అరరే! పంకజబాంధవుం డరిగె సంధ్యాకాలమున్ దోచె సం
గర మాపంబడె రెండుపక్షముల మొనగాండ్రైన సేనాపతుల్
ద్వరతో నేగుచునుండి రింక శిబిరాలన్ జేర సైన్యమ్ముతో
బరువై తోచిన ఖడ్గశూల కవచవ్రాతమ్ముతో సోలుచున్.

మనుమసిద్ధిసేన మజ్జనం బొనరించి
భోజనంబులెల్లఁ బూర్తిజేసి
శ్రమలువాయ మెల్ల శయనించి రొక్కట
వీరశయనశాయి వీగులట్ల.

—: కాటమఱేఁడు పిన్నమనేనితో సంప్రదించుట :—

కాటమఱేనిసేన తమ కాయముఁ దూలఁగఁ గత్తిపోటులన్
మాటికి సొమ్మసిల్లి మతిమాంద్యమునన్ శిబిరాల కేగఁగా
గాటమఱేఁడు గాంచి తమకమ్మున బిన్నమనేనితోడ ని
ష్పాటున నీకుఁ దోచిన యుపాయ మదేమని పల్కె ఖిన్నుఁడై.

ఱేని ఖిన్నత్వమరసి సైరింపరాని
బాధపడి యోచనమొనర్చి పలికె నిటుల
గడుసుఁ బిన్నమనీడు నిక్కంపుచరిత
కనుగుణంబగు లలితవాక్య ప్రసక్తి.

మన మందఱ వసుదేవనందనుఁడు జన్మంబందె "బొల్లావుఁ"గా
మనమందేగి వినీతిస్తోత్ర మొనరింపన్ బొల్లియావే రణం
బొనరించున్గద! శత్రుసంతతికి నిర్మూలమ్ము సిద్ధింపఁగా
మనకున్ దిగ్విజయమ్ముఁ బ్రాప్తమగు లెమ్మా పోద మచ్చోటికిన్.

అవునవు నీవుచెప్పునది యందఱకున్ బ్రియమైన వాక్యమే
యవుఁగద! లెమ్ముపోదమని యార్తిమెయిన్ ధరణీంద్రుఁ డెల్లరున్
దవిలి భజింప నయ్యెడకుఁ దత్పరతన్ జని బొల్లియావునున్
వివిధ సుమాద్యలంకృతుల వేదవిధిన్ బొనరించె నర్చనల్.

అర్చనలతోడఁ జందనచర్చఁ గూర్చి
ధూపమొసఁగుచుఁ దోడ్తోన దీపమిచ్చి
వివిధ భక్ష్యాన్నములను నైవేద్యమొసఁగి
కేలనిముడుచు మెల్లఁ దాంబూలమిడియె.

అవల నీరాజనమ్ము సమర్పణమ్ముఁ
జేసి ముమ్మాఱుఁ దిరిగి విశేషభక్తి
వందనమొనర్చి పలికె గోపాలమూర్తి
మాకు విజయమ్ము దయసేయుమా సతమ్ము.

—: బొల్లావు యుద్ధమున కేగుట :—

మొఱవిని మాఱువల్కనన మోర యొకింతగ నెత్తి ఱంకె వై
చి రణమొనర్పఁ బోదునని చెప్పిన యట్టుల బొల్లియావు వీ
ర రసము మూర్తివంతముగ రాజిలి తోఁకమరల్చి త్రిప్పుచు
ద్ధురగతి డెక్కలన్ భువిని దువ్వుచు దుమ్మొగఁజిమ్మెఁ బెల్లుగన్.

అసురముఖాల గుడారము
వసతిని విడనాడి వచ్చివచ్చి బిరానన్
పసగలుగు నడల వైరుల
మసిపుచ్చక విడువనన్న మాడ్కిని వెడలెన్.

వెడలుచు 'బుస్సుబుస్సు' మను వెచ్చనియూర్పులు బొల్లియావొగిన్
విడుచుచుఁ గెవ్వుమంచు నరివీరులు దిగ్భ్రమజెంది మూర్ఛతో
బుడమిని ద్రుల్లి తుల్లిపడి పోవునటుల్ బెనుఱంకె వైచె—న
ల్గడలను మాఱుమ్రోగి భయకంపము లొక్కట బిక్కటిల్లఁగన్.

పడి వడిలేచి దిక్కులకుఁ బర్విడు సైన్యము జిమ్మచీకటిన్
నడకలు దాఱుమారగుచు నట్టడవిన్ జరియించుచున్నటుల్
గడె కొకమాఱుఁ దోప వడకన్ దొడఁగన్ గజబృంద మంతలో
నడలుచుఁ గాలిఁద్రొక్కుడుల నట్టె హుటాహుటిఁ ద్రొక్కి వైచెఁగా.

—: బొల్లావు యుద్ధము :—

చూచుచుండంగ బొల్లావు చోద్యముగను
శిబిరములఁ గూలఁదన్ని నిశ్శేషముగను
నిదురవోయెడి వీరుల నదిమి బొడువ
నార్తనాదంబు లడర వారడలి చనిరి.

ప్రాణములు గుప్పిటన్బట్టి పర్విడెడు
వారికయ్యెడ—మెట్టని—పల్లములని
శంకలని ముండ్లపొదలని పంకసంక
లితముతో దోవ లనెడు దెల్వియు నశించె.

ఆవుకాలితాపు లంది యుద్ధమరేయి
తూలి నేలబడుచు వీలుదప్పి
చెదరి విఱిగినట్టి శిబిరాలకంబాల
వలన నిదురవోవువారు బడిరి!

పడిన సేనలెల్లఁ బడఁద్రొక్కి బొల్లావు
హాతమొనర్చి వేగు నంతలోన
యుద్ధమింకఁ దీరెనోయన విశ్రాంతి
గైకొనంగ నెలవుకడకుఁ జనియె.

—: గోవధ :—

తెలతెలవారినంత రణధీరులు జచ్చినవారు జావఁగా
నిలిచినవారు శూరులయి నిద్దురవీడి కటారులంది వి
చ్చలవిడి సాధుగోవధకు సాగి యొకానొక చెట్టుక్రింద మేన్
బులిసి పరుండకే నిదురవోయెడి గోవును జంపి రొక్కటన్.

చంపినవారినిన్ దిరుగఁ జంపినగాని జలమ్ము ముట్టఁగాఁ
దొంపువహింపమంచు రణధీరులు యాదవవీరు లొక్కటన్
దొంపరులాచుఁ జేసిన ప్రతిజ్ఞకుఁ గాటమరాజు మెచ్చి పూ
రింపుడు మీ ప్రతిజ్ఞ; లొనరింపుడు వీరవిహారమం చనెన్.

—: బీరినాయని యుద్ధము :—

తన మనుజేశునాజ్ఞఁ దొలుతన్ వెడలెన్ రణభూమికిన్ రణం
బొనరుప — బీరినాయుడను యోధుఁడొకండు మతంగవంశ్యుఁ డ
త్యనుపమ ధైర్యయుక్తుఁ డనుతాపమునన్ ధర జాంబవంతుఁడే
జననమునంది యివ్విధి వెసన్ బయనించెననంగ ధీరుఁడై.

వీరభద్రవరమ్మున వీరుఁడై చు
నవతరించిన బీరినాయఁడు పగర
గొందఱన్ జంపి భయవసంకులరణం బొ
నర్చి తాను గడకుఁ బ్రాణములు వదలె.

—: ఉభయసైన్యములు డీకొనుట :—

ఉత్సాహ మొదవంగ నుదయాద్రి యుమ్మయ్య
చెన్నపట్టణ చంద్రశేఖరయ్య
పెదవేగి వరదయ్య పెదవేగి చొక్కయ్య
గయికొండ సోమన్న గంగరాజు
ఆర్లకొండచ్చిరాజయ్యయుఁ దిరుమల
తిప్పయ్య యుల్కొండ తిమ్మరాజు
ప్రభగిరిపట్టణ పద్మశేఖరరాజు
వెలకంచి వేంగళ విజయరాజు
దేవముని వెంగళయ్యయుఁ దిరుమలయ్య
మొదలుగాఁగల వీరులు మొనసి మనుమ
సిద్ధి మనుజేశుపక్షమ్ము జేరి వైరి
సేనతో మార్కొనిరి వీరసింహులగుచు.

పలనాటిసీమ సంవాసియౌ వెల్మ బా
వయునైన పద్మభూవరుఁ డొకండు
పల్లికొండనృపతి చల్లపిన్నమనేడు
పాచయ్యనాయ డప్పయ్య ఘనుఁడు

దొనకొండకు సీమకు దొరయైన వైతము
నాయ డెబ్బప్పయ్య నాయకుండు
పుత్తను రాజయ్య ముమ్మయ్య నాయఁడు
పోలయ, పాపయ్య, బుడగలయ్య
చల్లసోదరు లాదిగా సహృదయులగు
వీరులన్ గూడి కాటమవీరుఁ డెత్తి
వచ్చె స్వీయముగఁ జోడభూపాలమౌళి
మనుమసిద్ధి నెదుర్కొను మత్సరమున.

రథులు మహారథు లతి
రథులున్ సమరథులు నర్ధరథికులుగాఁగన్
బృథుసేన విభాగించుచుఁ
బ్రధనం బొనరించి రుభయపక్షమువారల్.

యాదవవీర భారతమహారణ మిద్ది యనంగ యాదవుల్
మేదిని జోడరాజులకు మేటి యనంబడు మన్మసిద్ధితోఁ
గాదనలేక ఢీకొనిరి కంపితచిత్తులుగాక యుద్ధమ
ర్యాద నతిక్రమింపక జయాపజయంబులు జూడ కుగ్రతన్.

—: పిన్నమనీడు మరణించుట :—

ఎదిరిబలంబు జూడ కొక వేటున శాత్రవకోటిమీది క
య్యదనునఁ గత్తిదూసిన బలాఢ్యుని బిన్నమనేనిబట్టి పే
రెదఁ గరవాలమున్ దిగిచె నింతకు రోజుచు భీమనేడు మన్మసి
ద్ధిదళము మోదమందఁగఁ బడింబడి వైరిదళమ్ము లేడ్వఁగన్.

పొడిచిన కత్తిపోటునకు బోరన బిన్నమనేడు రక్తమున్
వెడలఁగ మేనువ్రాసెఁ బృథివిన్ బడి కాటమతేఁడు వంతచేఁ
గుడిభుజ మెత్తి కూలెనని క్రుంగి విషాదముతోడఁ దోడనే
వెడలె మహోగ్రవృత్తి రణభేరి సెలంగఁగ మన్మసిద్ధిపై.

—: పద్మనాయఁడు భీమసేనితో తలబడుట :—

ఆపయిఁ బద్మనాయఁ డసహాయత వెల్వడి భీమసేనిపైఁ
గోపముతోడ డీకొనె నకుంఠిత భూరిపరాక్రమైక సం
దీపితుఁడౌచు స్వామియెడఁ దీరని భక్తివిశేషగౌరవా
రోపిత చిత్తుఁడై ప్రబల రోషకషాయిత నేత్రయుక్తుఁడై.

—: కాటమ సేనితో మనుమసిద్ధి డీకొనుట :—

ఏనుఁగు నేన్గుతోడ విజయేచ్ఛఁ బెనంగినయట్లు జోడభూ
జాని బరాక్రమించి పిలుచన్ గరవాలముఁ గేలఁబూని క
య్యానకు నెత్తివచ్చు సమదారిని గాటమసేని గాంచి ప్ర
జ్ఞానిధియాట డీకొని వెసన్ సమరం బొనరించుచుండెగా!

తక్కిన వారలున్ దమకుఁదాము సమాన బలాఢ్యులౌ యశో
భాక్కులతోడ మార్కొని ప్రభాసముదగ్రతఁ బోరుచుండి రిం
కొక్కెడన్ గచాకచిమహోద్ధతి యుద్ధభటుల్ బెనంగ వే
ఱొక్కెడన్ దలాతలి రణోర్విని గాల్బలమొండు బోరడిన్.

నెత్తురుటేరు పాయలయి నేలఁ బ్రవాహముగాఁగ బారఁగా
గత్తికిఁ గండ దూరమయి గాకుల గ్రద్దల నోటికెక్కఁగా
మొత్తముగా శవంబులు సమూలముగా భువిఁ గూలుచుండగా
నత్తఱిఁ జూచువారికి భయప్రదమయ్యె రణోర్వి యెల్లెడన్.

"ఆగు మెక్కడకేగె" దని వైరి నదలింప
నొడుగఁబఱచుచుఁ గూలునట్టివారు
పిడికిటన్ ఖడ్గంపుఁ బిడిబట్టి వ్రేయుచు
వ్రేటుతోడ దివికి వెడలువారు
కసిదీర వైరినిన్ గద్దించి తిట్టి పం
డ్లిగిలించునంతలో నొగులువారు
ఎడఁదనాటిన దెబ్బ కడలుచు నఱచేత
నదుముచు బుడమిపై నొదుగువారు
హా! హతోస్మి యటంచు హయంబునుండి
పడి బిరానఁ గనుల్ దేలవైచువారు
నగుచు వసమాంస రక్తసమాశ్రితమ్ము
సమర మొప్పారె బీభత్ససంప్రదమ్ము.

వేశ్యచిలుక కతమ్మున వెడలినట్టి
సమరమింతకు భీభత్స సమరమయ్యె
మనుమసిద్ధికిఁ గాటమ మనుజపతికి
గాలవాహిని కెదురీతగాఁడు గలఁడె!

—: పద్మ భీమన లోకేశుఁ గూలుట :—

స్వామిభక్తి పరాయణత్వమునఁ బద్మ
భీమనలు పోరిపోరి సంగ్రామసీమ
నొకరికొకరును దీసిపోవక యొడుచు
నొను చూకేవేళ భూమిపైఁ గూలిరకట !

తమతమ మిత్రులిట్లు వసుధాస్థలిఁ గూలినవార్త సోకినం
త; మమత వీడలేక కనుదమ్ములఁ గ్రమ్మెడి నశ్రుపూరముల్
గ్రమముగ గోటమీటి, తమకమ్మున హెచ్చిన చిత్తవృత్తిమై
సమరము సల్పి రాపయి వెసన్ మన కాటమసిద్ధి భూపతుల్.

—: మనుమసిద్ధి కాటమప్రభువులు గూలుట. :—

అదనుగ్రహించి కాటమధరాధిపుఁ డమ్మెయి మన్మసిద్ధి పై
రెదపయి ఖడ్గమెత్తి విజయేచ్ఛను వైవఁగ — మన్మసిద్ధియున్
బదులును దీర్చుకోఁదలఁచి బాకరివక్షము నాటనేయఁగా
దుద కిలపై హతోస్మియని తూలిరి నెత్తురు గ్రక్కు చిర్వురున్.

ఉభయసైన్యాలఁ గలవర మొకటఁ బ్రబల
నార్తనాదంబు లడరె దిగంతములను
శిబిరముల జేర్చఁబడిరి నిర్జీవులయిన
మనుమసిద్ధియుఁ గాటమ మనుజపతియు.

ఇప్పటికి మన్మసిద్ధిమహీశు శిబిరము
భక్తిరణగంగమాంబికా పాదములకు
గానుక నిడినాఁడఁగద యని కాటమపతి
శిరము బకబకనవ్వె నచ్చెలువుమీర.

ఇరువురు నృపతులు నొకపరి
ధరణిని బడియుండు టెఱిగి తా నిస్పృహయై
వరుఁడనుచు ఖడ్గతిక్కన
కొఱకై జయలక్ష్మి నిలువఁగోరెన్ దుదకున్.

— ఖడ్గతిక్కన్న రెండవమాఱు యుద్ధమునకు వచ్చుట.

ఆలోనన్ వినవచ్చెఁగా ప్రళయరౌద్రాకార ఘర్జస్థలీ
లాలాస్యప్రభవైక గర్జనకరాళధ్వానమున్ బోలి ని
ర్వేలాహంకృతి ఖడ్గతిక్కన రణోద్వేగ ప్రభూతమ్ము వి
రాలాపమ్మటు శాత్రవప్రకర ధైర్యస్థైర్య నిస్తారమై.

ఆలింపుండదె ఖడ్గతిక్క మదహర్యక్షమ్ము గర్జించెడిన్
దూలించున్ నిజశాత్రవప్రతతినిన్ దుర్వారఁగాఁ బట్టుచున్
బాలించున్ రణచండి నామిషవసాపానీయ మందించుచున్
దేలించున్ రుధిరస్రవంతి శవపంక్తిన్ దొప్పలై తేలఁగన్.

కదన క్షోణికివచ్చెఁ దిక్కన మహోగ్రస్ఫూర్తి గుఱ్ఱమ్ముపై
నెదిరింపన్గల వీరుఁడెవ్వఁ డిఁక లేఁడే రుద్రుఁడన్నన్ బదిం
బది హాస్యంబగు — నాతఁ డెద్దుపయినిన్ బల్లెంబుతో వచ్చునే
గద! గుఱ్ఱం బిటులెక్కనే కరమునన్ ఖడ్గంబు సంధించునే!

అదె కనుఁగొంటిరొక్కొ! సమదారి మదేభవిదారి కేసరిన్
విదళిత శత్రురక్త పరిపీత పరిష్కృత ఖడ్గధారినిన్
సదమల కాంతిపుంజ విలసల్లలితైకయశోఽనుకారినిన్
గదనవిహారు ధీరగుణగణ్యతరున్ రణతిక్కవీరునిన్.

ఓరీ రాజకులాధమా! నృపులు లేరో కాటమక్ష్మాధవా!
క్రూరా! నీవొక వెఱ్ఱిగొల్లవయి లోకుల్ నవ్వ నెల్లారి మ
త్తారాతి ప్రచయప్రమత్తగజహర్యక్షమ్ముపై దూఁక నీ
బీరమ్ముల్ ప్రకటించెదే మిడుత దివ్వెన్ జేరఁగా నేర్చునే.

తిక్కననోట వెల్వడిన ధీరనినాదముతోడ దిక్కులన్
బిక్కటిలంగ వెల్వడె విభిన్ననినాద మొకండు తండ్రి నీ
దిక్కగు మన్మసిద్ధిజగతీధవుఁడున్ మఱి కాటమేశుఁడున్
రక్కసిపోరుసల్పి రణరంగమునన్ దెగి రొక్కపెట్టునన్.

ఎక్కడి మన్మసిద్ధిధరణీశ్వరుఁ డక్కట! నిన్ను వీడి తా
నొక్కఁడు వోయెనన్న నుడి యొక్కఁడు కర్ణకఠోరమా చొగిన్
తిక్కన వీనులన్ బడ విదీర్ణమనస్కుఁడుగాక ధైర్యమున్
జిక్కఁగఁబట్టి యాతఁడు వచించె నిటుల్ ఘననిస్వనంబునన్.

—: తిక్కన సింహనినాదములు :—

ఓ రిపువీరులార! యిటు లూరక చూచెద రేల పోరిలో
వీరుల జన్మమాక్కుఁగఁ బ్రవీణత మీ యొఱగడ్డపాటి భూ
దారుపతాకమున్ గొని యథాస్థితి బోవఁగలాఁడ జూడుఁడీ
బీరము లేల నేన నొక వీరుఁడు గల్గిన మమ్మెదుర్చుడీ!

రండో సైనికులార ! తండములుగా రండింక నల్వంకలం
దుండన్ రండిదె యెద్దునెక్కి యిట కోహో ! బ్రహ్మరుద్రయ్య రు
ద్రుండట్టుల సేనతో వెడలె మార్కొండున్ వడిన్ బోయి యీ
జెండాపై మనకుండు ప్రేమ మృతి నాజిన్ బొందినన్ జాలదే !

తెలుఁగున్ జోదుల కీర్తితేజము నయోద్వేగైకభాగ్యమ్ము ని
ర్మల శౌర్య ప్రతిపాదకమ్ము గవితా మంత్రప్రభావానలా
ర్చిఁ వో త్తేజితదుర్గమమ్ము — సమతాచిహ్నమ్ము వైరివ్రతా
పలయోద్భాసిత మాత్మకేతనముతోఁ బైకెక్కు నీటెక్కెముల్.

సమద రిపుకోటి తలవంచి సాగిలపడి
దేనికి నమస్కృఁజేసి తత్తేజమాత్మ
నిలిపికొనఁజాలె నట్టి నిస్తులయశోవి
కసిత కేతన మీపతాకమున వెలయు.

—; తిక్కన బ్రహ్మరుద్రుల ద్వంద్వయుద్ధము: —

అని తన సేన నాజికొఱ కావల నీవల జుట్టుపట్టఁ ది
క్కన నిలుచుండునట్లు వడిఁగట్టడ ముగ్రతఁజేసి వాజి ముం
దున కెఱగడ్డపాటినృపు దుస్థితి కేడ్చెడి బ్రహ్మరుద్రు డీ
కొనఁ జనఁబోవ నొక్క దుముకుల్ దుమికించెను వాగెలాగుచున్.

దుమికిన ధాటికిన్ వెఱచి తూలిన వైరిచయమ్ము భూమినుం
డి మగిడిలేచి సర్దికొని డీకొనసాగెను దెచ్చుకొన్న బీ
రమున హాహాకారమ్ముల్ బరికరమ్ము గరమ్ములఁజొన్పి తీవిగా
దమతమచోట నిల్చుచు వితాకును జెందియు జెందనట్లుగన్.

హరులు హరులతోడఁ గరులెల్లఁ గరులతో
భటులు భటులతోడఁ జటుల ఫణితి
సలుపుచుండి రచట సమర మొండొరులతో
జాతిమచ్చరమున సమతఁ బెనఁగి.

సారమతిన్ బెనంగుచుఁ గచాకచి — గ్రుద్దుచున్ దలాతలిన్
బోరుచు ముష్టిముష్టిగ నపూర్వవినోదముగా ముఖాముఖిన్
దూరుచు వీరులుద్ధతి మనోరథమున్ రథపంక్తినెక్కి వేఁ
బారుచుఁ బోరుచుండిరి సెబాసన నొండొరు దీసిపోవకే.

శరవేగమ్మున ఖడ్గతిక్కనయుఁ బ్రజ్ఞన్ బ్రహ్మరుద్రయ్యయున్
గరవాలంబులఁ గేలనందికొని ఖడ్గాఖడ్గిఁ బోరాడుచో
సరిబేసుల్ దిలకించుచున్ విజయరాజ్యశ్రీలు వీక్షింపఁ జొ
చ్చిరి దగ్గుత్తికతో — వివాదములతో శృంగారపున్ జూపుతో.

ఎవని వరించునో గద జయేందిర యేన్గులు గ్రుమ్ములాడు న
ట్లవమతిఁ జెంద కెంతయు రణావనిఁ దిక్కన బ్రహ్మరుద్రు లు
త్సవమునఁ బోరుసల్పి రిఁకఁ బ్రాణములపై గల తీపిమాని లోఁ
దవిలిన యీర్ష్య నొక్కవనితామణి కిర్వురు బోరు కైవడిన్.

ఎక్కరి తమ్మెఱుఁగక యెదురైన వీరుల
బొలియించిరొక కొంద రలఘుకీర్తి
దనవారు వీరలంచని విచారింపక
గసిమసంగిర కొంద ఱసమదీప్తి

జలమునఁ దళతళ త్తళలీను గత్తుల
 నలయించిరొక కొంద అమితశక్తి
బలవంతులమటంచు బైపైకి దుముకుచు
 నరులఁగూల్చిరి గొంద అతులయుక్తి
శకలములుగాఁగఁ జతురంగసైన్య మిట్టు
లొకరికొకరికి దీసిపోవక పెనంగి
జోరుమని బాఋ నెత్తురి యేరులందు
దొప్పదోగిరి వీరయోధులు దమంత.

కరులీల్గెఁ దురగంబులుఁ బడిసె భింకంబారి సైన్యంబు ల
త్తఱిఁ జెల్లాసెదరై పలాయనవుమంత్రం బోపికఁ బాడె జం
కిరి జోదుల్ గరవాలతోమదము లగ్గిఁ బ్రమగ్గె భీభత్స రౌ
ద్రరసావేశపరీతమై తనరె యుద్ధక్షేత్ర మొక్కొమ్మడిన్.

తిక్కయ బ్రహ్మరుద్రయులు ధీరతమై వెనుదీయ కొక్కరున్
దిక్కరులట్లు ఖడ్గముల దిక్కులు బిక్కటిలంగ నార్చుచున్
రక్కసి పోరొనర్చుచు బరాబరి నొక్కనిచేతికింక వే
ఒక్కఁడు జిక్కకే రణమహోత్సవమందుచు నుండి రొక్కటన్.

—: కాటమరేని విజయపతాకమును తిక్కన హరించుట :.

సమయముఁజూచి తిక్కన బసందుగ సింహకిశోర మేన్గుపై
దుమికిన రీతి రుద్రుడయి దూకి తదీయ ఖరాసిద్రుంచి సం
భ్రమమున దీర్ఘశాఖ కెగఁబ్రాకి యొటో యొఱగడ్డపాటి
రమణ పతాకమున్ గొని భిరాన దిగెఁ గనుఱెప్పపాటులో

దిగి తన గుఱ్ఱమెక్కి మన తిక్కన సింహపురమ్ముఁబోవు త్రో
వఁ బయనించె సేనలును బర్విడి వెంబడిపోవ రుద్రుఁడై
రగిలిన కోపవహ్నికిఁ బరాజయ మొక్కఁడు దోడుగాఁగ సే
నఁ గొని చనెన్ హయమ్ముపయి నందిని బోవిడి ఖడ్గధారియై.

—: తిక్కన్నను బ్రహ్మరుద్రయ వెంబడించుట. :—

మునుముందుగఁ దిక్కన్నయు
వెనువెన్కనె బ్రహ్మరుద్రవీరుఁడు బంతం
బున నొండొరు జనుచుండిరి
జను లీ వేడుకనుఁజూచి చకితులు గాఁగన్.

వెనుదిరిగి చూడకే మన
రణతిక్కన బోవుచుండ రణపాండితి నొ
ప్పిన బ్రహ్మరుద్రవీరుఁడు
వెనుదవిలెన్ దొంగగతిఁ బ్రవీణత మెరయన్.

—: బ్రహ్మరుద్రయ్య వెన్దవిలి తిక్కన్నను పొడుచుట. :—

తవిలి హుటాహుటిన్ దురగధాటిఁ గటారి బరాక్రమించి వె
న్నవియఁగఁ జంకదుడ్డు శరణార్థియనన్ దగి బ్రహ్మరుద్రుఁ డ
త్యవసరయుక్తి నెత్తి వెనుకాడక దిక్కన వీపుపై వెసన్
దవులఁగ వైచి దొంగగతి దాగికొనెన్ దన సైన్యకోటిలోన్.

వైచిన కత్తిపోటు బలవన్మరణమ్మున కాటపట్టువై
యేచఁగఁ దిక్కవీరుఁ డటులే రుధిరమ్మ దొఱంగనీక జే
వైచి యడంచి గళ్లెమును బండ్లబిగింపున బట్టి లాగు చె
ట్లో చనుచుండెఁ గేతనము నోపికమై గుడిచేతఁ బట్టుచున్.

తిక్కన బ్రాహ్మణుండగుటఁ దీరనిచింత వధింపరామి నా
టక్కరి కాటమప్రభువు డాసెనె — జంగమబ్రహ్మరుద్రు డీ
ఫక్కిని డాసెనంచు రణపండితులౌ తమవారు పల్కఁగా
బిక్కమొగాన రుద్రయ వివేకమునన్ దలవంచె ఖిన్నుఁడై.

దొంగవిధాన వెన్దవిలి దోర్బలయుక్తిఁ గటారివైచి వి
ప్రుం గరుణింప కీ పనికిఁ బూనితి గాటమతేవిదైన యు
క్తిం గనిపెట్టితే జడుడ! కీరితి నీ కెటువచ్చు జంగమా!
లింగమదేలరా మెడకు లేవటరా ధరియింప గంటలున్.

—: ఓరిగంటినుండి సైన్యము వచ్చుట :—

కనుగొంటే శివదేవయప్రముఖుఁ డొక్కండింత సైన్యమ్ముతో
జనుదెంచెన్ గద కాకతీయవిభునాజ్ఞన్ బ్రహ్మరుద్రయ్య! నీ
పనిదీరెన్ — రణతిక్కనన్ బొడిచి పంతంబు సాగించుటే
వనిగా నెంచితి — నీపయిన్ దుముకు నీబ్రహ్మాస్త్రమున్ గాంచితే.

అనుచున్ దిక్కనసేనలోని భటులొయ్యన్ బ్రహ్మరుద్రయ్యతో
డ నిటుల్ పల్కుచునుండ — గుఱ్ఱమును దౌడాయించుచున్ ఖడ్గతి
క్కన నెల్లూరుపురమ్ముఁజేరి కవితిక్కన్నన్ వెసన్ గాంచి కే
తనమర్పించి నమస్కరించి కనులంతన్ మూసె గుఱ్ఱమ్మపై.

ఋణమును దీర్చికొంటి బళిరే! రణతిక్కన మన్త్రసిద్ధియున్
దన మది మెచ్చి భూమిపయిఁ దాల్చిన నీయవతారమింతతోఁ
దనరె సమాప్తమై ఫలము దప్పకిగల్గె యశోనిరూఢి నీ
వు నమరజీవివైతి తనువున్ ధరియింపఁగనేల గ్రమ్మఱన్.

—: దేవతలు పుష్పవృష్టిని వర్షించుట. :—

వీరస్వర్గము నీకుఁగా దెఱచి యవ్వేల్పుల్ ముదంబందుచు
న్నారావంకఁ గనుంగొనన్ గదవె యన్నా! ఖడ్గతిక్కన్న! నీ
పేరున్ శాశ్వత కీర్తివంతముగ నిల్పెన్ మూడులోకమ్ము లా
తారార్కమ్ముగ — సూర్యబింబమిదె భేదమ్మింకఁ గావింపుమా.

అనుమానంబదియేల బింబమిటు లొయ్యన్ భేదమున్ జేసి చ
క్కనిమార్గం బొనరించుకొంచు రణతిక్కన్నా! బిరానన్ ముదం
బున స్వర్గంబున కిట్టి పొమ్మిఁకను జో — జో — స్వాగతంబీయ మ్రో
లను వేల్పుల్ దొరసానులే విరులమాలల్ బూని యున్నారులే.

కనుగొంటే సుమమాలికాచయముఁ దిక్కన్నా! దివ్యమందార వృ
క్షనవోత్పన్న సుమప్రపంచముల సింగారించి నీ కంఠమం
దున నీపై ననురాగయుక్తి మునుముందున్ నేను నేనంచు సి
గ్గున బృందారక కన్యకామణు లదే కూర్చుండియున్నారుగా.

వినవచ్చెన్ వినుమయ్య నీ శ్రవణముల్ విప్పారఁగాఁబట్టి తి
క్కన! మ్రోసెన్ సురదుందుభుల్ గనుమదే కైవారముల్ గిన్నరుల్
బనిగా గిన్నరకంఠపాళి నొనరింపన్ జేరియున్నారు బ్ర
క్కన నాట్యంబున కచ్చరల్ నిలిచి రింకన్ బాటకున్ దోడుగా.

—: శివదేవయ్య బ్రహ్మరుద్రయ్యను నిర్మూలించుట :—

శివదేవయ్య స్వకీయసైన్యమున నాజిన్ బ్రహ్మరుద్రయ్యతో
దవిలెన్ వానికి మూడె నాయువిఁక జింతన్ మానుమయ్యా ఘనుం
డవు నీవే — తరువాతి వారొరులు — ఖడ్గంబన్న నీచేకదా!
భువి నీకెవ్వఁడుసాటి ఖడ్గమునకున్ బోల్పంగ లేదొండిఁకన్.

అరరే! రుద్రయగూలె నాహవమిఁకేలా! కాలికిన్ బుద్ధిసె
ప్పి రయానన్ బఱువెత్తఁగాదొడఁగెఁ బెంపేలేని తత్సైన్యమున్
బరతెంచెన్ శివదేవమంత్రి మఱిఁ దత్పార్శ్వంబునన్ సైన్యముల్
బరమాహ్లాదము మోముదమ్మిపయి శశ్వద్దీప్తి భాసిల్లఁగన్.

కనవేమో మన మన్మభూపతి పతాకం బల్లదే కోటపై
తన కింకెద్దియు నీడులేదన మహోత్సాహంబునన్ నీవు తె
చ్చిన మేలా నెఱగడ్డపాటి విజయశ్రీ చిహ్నమైయొప్పు చ
క్కని టెక్కెమ్మును దోడనిల్పికొని తిక్కన్నా! ప్రకాశించెడిన్.

—: శివరుద్రయ్య తిక్కయజ్వల సమావేశము :—

తిక్కయజ్వయు మఱి శివదేవమంత్రి
మనుమసిద్ధికుమారు సామ్రాజ్యపీఠి
నుంచి యభిషేకమొనరింప నెంచియున్న
వారని యెఱుంగుమిది శుభవార్త నీకు.

వినుమయ్యా శివదేవమంత్రి మఱి నీ వియ్యంకుఁడీవ్వేళ — నీ
తనయన్ గీర్తిల సద్గుణాలయ యశోదన్ భక్తిమై తత్తనూ
జున కర్పింపఁదలంచెఁ దిక్కకవి పూజ్యుండింక — స్వర్గమ్మునం
దనయంబీవు?సుఖమ్ముఁ గైకొనుము బ్రహ్మానంద మేపారఁగన్.

అనుచున్ దిక్కులు మాఱు మ్రోగునటులీ యార్భాటమున్ బల్కు
వ్వనిచే నిట్లు వచింపఁగాబడినవో భావింప నిందెవ్వరున్
గనరారింతకుఁ — బైకిఁజూడ నిఁక నాకాశంబిటుల్ పల్కునం
చని తోఁచెన్ - విరివానయొప్పు నిదె యేలాశంకతద్వాణియే !

విరివానన్ గురిపించి వేల్పుదొర లవ్వీరున్ బ్రశంసించి ర
ద్దిర ! యంచున్ భువిలోని వారనఁగ నేతెంచెన్ గవీశానుఁడున్
ద్వరతోడన్ శివదేవమంత్రిఁ తనవెంటన్ రా — విషాదమ్ముతోఁ;
గరుణన్ మూగిరి పౌరులేడ్చు చటకున్ గన్నీరుమున్నీరుగా.

కవిమహాశయుండు గంటనీర్వెట్టఁగా
బరిజనంబులెల్ల బావురుమనె
గడకు వగచువారిఁ గవితిక్కయజ్వయే
తేర్చె హితమితోక్తిఁ దేటపఱచి.

—: చానమ్మ అశ్వారూఢుఁడై వచ్చిన మృతభర్తకు నివాళులొసంగుట :—

పదపడిఁ బౌరలోక మెడఁబాయఁగఁ దిక్కనసోమయాజియున్
సదమల కాకతీయనృపసత్తము మంత్రియు నిర్వురప్పుడే
కదలి హయమ్ముతో నడచి కొల్నడకన్ రణతిక్కనాగ్రణిన్
సదనము జేర్పఁ దారసిలెఁ జానమ హారతి పళ్లెరంబుతోన్.

వీరసతీలలామగఁ బ్రవీణత నన్నొనరించి తల్లినిన్
వీరునిగన్నతల్లి యని వేవురచే ననిపించు వీరి దే
వేరిగనైతిఁ — దీర మదభీష్టము నేటికటంచు భక్తిమై
హారతియెత్తెఁ జానమ బయల్పడ నీకొక యశ్రుబిందువేన్.

బలితపు మేని సొంపు మెలివైచిన చక్కని కోరమీసముల్
గలిగిన మోముఠీవి — రిపుకాండ విదారణ కారణమ్ముగా
బలిమిని గేలఁగొన్న కరవాలముధాటి — హయాధిరూఢుఁడై
కలనికిఁ బాఱుతీరు — నివిగా రణతిక్కనకున్న భాగ్యముల్.

ఈ భాగ్యము లెవ్వనికే
నీ భూమిని గల్గియున్నె యింతకు నాథా
నీ భార్యనై తనర్చుట
నా భాగ్యము బండెనంచు నతి యొనరించెన్.

నతి యొనరించి భక్తి నయనంబులనుండి స్రవించు నశ్రులం
చితమతి మోద బాష్పములఁ జేసి ప్రదక్షిణముల్ బొనర్చి మ
త్పతిగతి సాహసమ్మును నవశ్యము నే నొనరింతునంచు న
య్యతివ తదీయకార్యమునకై నడుమున్ బిగియించెఁ గాఢిమై

—: ప్రోలమ్మ సంభ్రమము :—

ఏమి వచించినాఁడ వరరే మతిహీన! మఱొక్కమాఱు నీ
వేనుఱుపాటుతోడ వచియించినమాట వచింపుమింక నీ
వేమయిపోయెదో యవల నీవ యెఱుంగుదు నా సుతుండు సం
గ్రామము వీడి పఱ్వడెను గా — గనులారఁగఁ జూచినావుగా.

తిక్కఁడు పోరఁ వీడి చనుదెంచునె పిక్కబలమ్ము సూపి నీ
వెక్కడ జూచినాఁడ విదియే నిజమా నెడఁ గూలిపోవె న
ద్దిక్కులు — సూర్యచంద్రు లొకదిక్కునఁ జేరరె — శైలసప్తకం
బొక్కట మాఱు మ్రోఁగదె — పయోనిధులింకవె — చుక్కలూడవే!

అక్కట! నేనుగా నొసఁగినట్టివి — నా చనుబాలు ద్రావి మా
తిక్కఁడు పందయౌచుఁ గడితేరెనె పిక్కబలంబు సూపఁగా
గక్కురితిన్ — బలే పిరికికండలు బెంచెన నమ్మజాల నా
చక్కని తండ్రితో దురము సల్పెడివారు గలారె ధారుణిన్.

చనుబాలన్ గడుపారఁ ద్రావి నిజవక్షంబందు నిద్రించి త
ద్ఘనశక్తిన్ గయికొన్న జీవితము చేతన్ మే నిటుల్ పెంచి తి
క్కన వీరాగ్రణియై యరాతిచయమున్ ఖండించి దోశ్శక్తిమై
యనిలో రెండవ భార్గవుండనెడు ప్రఖ్యాతిన్ గడించెన్ గదా!

భండనపండితుండయిన భార్గవుఁబోలిన చిట్టితండ్రి, కీ
భండనమెంత దద్భటవివాదమదెంత — తదీయవాహినీ
భండనపాండితీచటుల పాటవమెంత నితాంతమత్తవే
దండముతోడ డీకొనునె తక్కటి బక్కమృగంబు లొక్కటన్.

నే ననుకొన్నరీతి నృపనీతి సుతుం డరిసేనఁ ద్రుంచి తా
వ్రానికవచ్చెనేని సరిపోయిన — దట్లొనర్పడేని మా
వానిని దద్ఘరాసిఁ దెగవ్రైచి పదంపడిఁ జీల్చికొందుఁ గా
సూనుఁడు బాలు ద్రావి సుఖసుప్తిఁ జెలంగిన యీ యురస్థలిన్.

అని తన భావవీథిఁ దోలుకాడు ననిర్వచనీయవాంఛకుఁ
మునుపొకసారి పందయయి పోరికిఁజాలక యిల్లుదూరి ని
ల్చిన సుతుఁడిప్పుడుఁ మగిడిఁ జెచ్చెరఁ జొచ్చెనటన్న వార్తయుఁ
బనివడిఁ దోడుఁగాఁ నిటువల్కుచుఁ బోలమవచ్చె వీధికిఁ.

వచ్చి బిరానఁ గోడలు నివాళులొసంగి నుతింప వాజిపై
హెచ్చిన ఠీవితో ననువులింతకుఁ బాసియుఁ గూరుచున్న సం
పచ్చయ సారవంతమన భాసిలు పుత్రునిగాంచి మెచ్చి నా
కిచ్చితె వీరమాతృపద మీ విధినంచు వచించి యిట్లనుఁ.

—: ప్రోలమ్మ తనయుని ప్రశంసించుట :—

చక్కని చంద్రహాసముఁ బసందుగఁ గేలధరించి వాజిపై
నెక్కినతీరు—మీసముల కే మెలివైచిన మోముఠీవినిఁ
బ్రక్కకు వాలఁగా నిడిన బల్ జలతారు వలుపాగతో
నిక్కిన సారు పౌరుషపు నిబ్బరమున్నిటఁ దిక్కఁడొప్పెడిఁ.

తిక్కఁడు జక్కనినాయన
తిక్కని కెవ్వండు సాటి తేకువభువి మా
తిక్కని గన్నందులకే
నిక్కరిణిని వీరమాత నే నైతినిగా !

సవతితల్లికి నమృతమొసంగి — తల్లి
ఋణముతీర్చిన వైనతేయుని విధాన
తల్లిదీవనలందిన తనయుఁ డవని
మురిసెఁ బ్రోలమ్మ తిక్కనమూర్తిఁగాంచి.

అవలఁ బ్రోలమ్మ ప్రముదితస్వాంత యగుచుఁ
గోడలినిజూడ నామెయు గోడుగోడు
మనుచు విలపింప కర్మిలి నత్తఁజేరి
పలికె నీరీతి సవినయభాషణముల.

—: సహగమనమునకై కోడలత్తను వేడుట :—

ధవునితోడిదె లోకమై తనరియుంట .
పతికి — సతిసొచు భర్తతో సహగమనము
జేయ సెలవిడుమత్తయ్య చిన్నబుచ్చ
కనుచు నైదునుబడిసె సతివమిన్న.

సతియొనర్చిన కోడలి సతిముదమున
నెత్తి కౌఁగిటఁజేర్చి తా నెలమి నిటుల
బలికెఁ బ్రోలమ్మ యానందబాష్పములను
జేవిదల్చుచు నెల్లరుఁ జేరివినఁగ.

—: ప్రోలమ్మ కోడలి కనుజ్ఞనిడుట :—

మాతల్లీ ! సుగుణైకపుత్రవుగదమ్మా పోయిరమ్మింక నీ
చేతోవల్లభుతోడఁగూడి సతివై శృంగారపల్యంకికన్
నీతిన్ నీ తరువాతి యింతులకు నెంతే బోధగావించుచున్
ఖ్యాతిన్ గూర్చుచు రెండువంశముల కాకల్పాంతరస్థాయిగన్.

అని కన్నతల్లి తనయుఁ
గని కౌఁగిటఁగ్రుచ్చుచు సహగమనముసేయన్
దను గుండె దాయిఁజేసియు
బనిచెన్ గోడలిని — గొడుకుఁబక్కన నిలువన్.

—: చానమ్మ సహగమనము :—

ఆవలఁ జానమ్మయుఁ దన
జీవితనాయకునితోడ జేజేధ్వని సం
భావితయై పల్యంకిక
పై వెడలెన్ బెన్నదరికి భగవదనుజ్ఞన్.

లలితవినీలవారి సమలంకృతయైన పినాకినీ నదీ
లలనదరంగహస్తముల లాలనజేసి సతీమతల్లినిన్
బిలిచి సభర్తృకమ్ముగ నభీష్టము దీరెనటంచు మేనిలోఁ
గలియఁగఁజేసి తద్యశము గానముజేయుచుఁ బాఱెఁ బొంగుచున్.



## మంగళాంతము

తిక్కన ! రణతిక్కన్నా !
తిక్కన్నా ! జోహారు నీకు దేశప్రేమిూ !
తిక్కన్నా ! నీకు జయమగు
తిక్కన్నా ! మంగళమ్ము ధీరవిచారా !

లక్ష్మీపురమునఁ జల్లా
లక్ష్మమ సీతయుల సుతుఁడు లక్షణపణితిన్
లక్ష్మీనారాయణ కవి
యీ తెన్గుతల్లి ఖడ్గతిక్కన కృతి విరచించెన్.

శ్రీ రాధాకృష్ణార్పణమస్తు.



జానకిరాం ప్రెస్, తెనాలి. — 1955.